# కాస్తంత ముందాలోచన, కొండంత వాత్సల్యం...

## చూపారంటే చాలు. కొద్దిపాటి పొదుపుతోనే 21 ఏళ్ల వయసుకల్లా మీ బిడ్డను లక్షాధికారిని చేయవచ్చు.

# యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధిలో పెట్టుబడి పెట్టండి.

మీ బిడ్డ అందాలొలికే చిన్ని పాప. మీరు దగ్గరుంటే చాలు ఆప్యాయత, అనురాగం లోటుండదు. అయితే ఎదిగే బిడ్డకి ఎదిగేకొద్దీ రోజులు గడిచి పోతాయి. ఆమె పెరిగి పెద్దదయి ప్రపంచంలోకి అడుగు పెట్టవలసిన సమయం వస్తుంది. జీవిత పోరాటంలో అనేక సవాళ్లను ఎదుర్కోవలసి వస్తుంది.

మరి మీ బిడ్డ భవిష్యత్తు కోసం ఇప్పుడే ఎందుకు ముందాలోచన చెయ్యరాదు! అందుకే, యూనిట్ ట్రస్ట్ వారి బాలల కానుక వృద్ధి నిధి (CGGF) లో పెట్టుబడి పెట్టండి. ఈ పథకంలో కొంత కాలం పాటు కొద్దిపాటి మొత్తాలను జమ చేయడం ద్వారా, 21 ఏళ్ళ వయసుకల్లా మీ బిడ్డను లక్షాధికారిని చేయవచ్చు.

ప్ర. మీ బిడ్డను లక్షాధికారిని చేయాలంటే ఎలా పెట్టుబడి పెట్టాలి?
జ. మీ బిడ్డ పుట్టగానే ఈ CGGF పథకంలో పెట్టుబడి పెట్టదలిస్తే ఈ క్రింది పద్ధతులలో ఏదైనా ఎంచుకోవచ్చు. (i) బిడ్డ పుట్టిన సమయంలో రూ. 1,100 పెట్టుబడి పెట్టి, బిడ్డకు 15 ఏళ్ల వయసు వచ్చేదాకా ప్రతి సంవత్సరం అంతే మొత్తం పెట్టుబడి పెట్టవచ్చు. (ii) వరుసగా 3 ఏళ్లపాటు రూ. 3,200 జమ చెయ్యవచ్చు, లేదా వరుసగా 6 ఏళ్లపాటు రూ. 1,900 జమ చెయ్యవచ్చు. (iii) ఒకేసారిగా రూ. 8,500 పెట్టుబడి పెట్టవచ్చు.

ప్ర. బిడ్డ కొంత పెద్దదైతే ఎలా చేయాలి?
జ. 15 ఏళ్ల వరకు ఏ వయసుకైనా అనువైన పథకాలున్నాయి. CGGF కరపత్రంలో ఆ వివరాలన్నీ ఇవ్వబడ్డాయి. ఆ కరపత్రం కోసం వ్రాయండి.

ప్ర. ఈ పథకంలో బిడ్డకు ఎవరెవరు కానుక ఇవ్వవచ్చు?
జ. తల్లిదండ్రులు, బంధువులు, స్నేహితులు, సంఘాలు, కార్పొరేట్ సంస్థలు.

ప్ర. కనీసం ఎంత సొమ్ము పెట్టుబడి పెట్టాలి?
జ. రూ. 500, ఆపై రూ. 100 గుణిజపు మొత్తాలు.

ప్ర. ఈ పెట్టుబడి పైన రాబడి ఎంతుంటుంది?
జ. సం. కి 12.5% చొప్పున, అందుకు తోడుగా 5 ఏళ్ళ కొకసారి బోనస్ ఉంటుంది.

ప్ర. గడువు పూర్తయిన తర్వాత మరేదైనా సౌకర్యం ఉందా?
జ. సొమ్ము వాపసు తీసుకునే బదులు మీ బిడ్డ అప్పుడు లభించే మరే యితర యూనిట్ ట్రస్ట్ పథకంలోనైనా పెట్టుబడి పెట్టవచ్చు.

CGGF (బాలల కానుక వృద్ధి నిధి) గురించిన ఉచిత సమాచారానికై ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయం వద్దగానీ, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ, పంచవటి సూపర్ మార్కెట్ లేదా ఎంపిక చేసిన హిందుస్థాన్ పెట్రోలియం పెట్రోలు పంపుల వద్దగానీ ఇండియన్ ఆయిల్ పెట్రోలు పంపుల వద్దగానీ సంప్రదించండి. లేదా మా కార్యాలయాలలో దేనికైనా వ్రాయండి.

లేదా అధిక వివరాలకై ఈ కూపన్‌ను ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయానికైనా పోస్టు చేయండి.

దయచేసి నాకు CGGF గురించిన ఉచిత సమాచారాన్ని పంపండి.

పేరు: ____________________

చిరునామా: ____________________

## యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా
(ప్రభుత్వ రంగంలో ఒక ఆర్థిక సంస్థ)

- 13, సర్ విఠల్‌దాస్ థాకర్సే మార్గ్ (న్యూ మెరీన్ లైన్స్) బొంబాయి-400 020 ఫోన్: 2863767/620 1995
- జస్టిస్ బషీర్ అహ్మద్ సయ్యద్ బిల్డింగ్, 45, సెకండ్ లైన్ బీచ్, మద్రాసు-600 001 ఫోన్: 587433/580938
- 203/204, మొఘల్ కోర్ట్ కాంప్లెక్స్, సెకండ్ ఫ్లోర్, బషీర్ బాగ్, హైదరాబాదు-500 001. ఫోన్: 240030.
- డోర్ నం. 29-3-12, వెంకటేశ్వర రావు స్ట్రీట్, ఆక్‌ఫోర్డ్ ఫర్మ్ వద్ద, రహమాన్ పార్కుకు ఎదురుగా, గవర్నరు పేట, విజయవాడ-520 002. ఫోన్: 63964.

Sista's-UTI-28/90 TEL G



# చందమామ

నవంబర్ 1990



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 3-00

సంవత్సర చందా: 36-00

# ఎవ్వరుతిన్నా స్నేహితులయ్యే!

పుస్తకాలపురుగులు, దెబ్బలాటకోర్లు, లావుపాటి వారు, పొట్టి
బుడంకాయలు, పొడుగుపాటి వాళ్ళు ఒకరేమిటి, అంతాకూడా కొత్త
హాజ్మోలా కేండీ తిని మంచి మిత్రులైపోతారు పుల్ల
పుల్లగా మహారుచిగా ఉంటుంది.
తియ్య తియ్యగా పుల్లగా ఉండే కేండీలు అనేక విధాల భలే
భలేగా ఉంటాయి. అవి చిన్న చిన్న అందమైన 'పిలో
ప్యాక్'లో వస్తాయి. ఆడుతు, పాడుతు, ఎగురుతు,
గెంతుతూ ఎక్కడికి వెడుతున్నా సరే కూడా
తీసుకు పోవచ్చు. పార్టీలు-పిక్నిక్‌లు,
ఇంట్లో లేదా స్కూల్లో తియ్య తియ్యగా
పుల్ల పుల్లగా ఉండే కొత్త హాజ్మోలా కేండీ
మీరు తినండి, అందరికి తినిపించండి.
మనసు కలిసిన మంచి మిత్రులైపోండి.

**పుల్ల పుల్లటి, తియ్యటి**









**Hajmola®**
**CANDY**

everest/d90/DIL/265 tel

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## ఆడంబరాలు వద్దు!

అడవులు నశించడంవల్ల ఏర్పడే దుష్ఫలితాలను గురించి కొన్నాళ్ళ క్రితం చెప్పుకున్నాం. అడవులు నశించడంవల్ల, క్రమంగా రకరకాల వన్యమృగాలు కూడా నశించిపోతున్నాయి. దంతాలకోసం ఏనుగులనూ, చర్మంకోసం లేళ్ళనూ ఇలా అనేక వన్యమృగాలను వేటాడి చంపుతున్నారు. ఈ దంతాలు, చర్మాలు మొదలైన వాటితో తయారయ్యే వస్తువులు నిత్యావసరమైనవా అంటే అదేమీ కాదు. అవి కేవలం మనిషి ఆడంబరాలకూ, అహంకారానికీ గుర్తులు. వీటివల్ల కొందరికి తాత్కాలికమైన ఆనందం కలగవచ్చు. అయినా, అలాంటివారు ఇరుగుపొరుగుల అసూయకు కూడా గురికావలసి వుంటుంది. అందువల్ల ఉన్న ఆనందం కాస్త దూరమయ్యే ప్రమాదం ఉంది!

కేవలం ఆడంబరాలకోసం ప్రకృతి ప్రసాదించిన అందమైన సంపదలను నాశపరచేహక్కు మనకు లేదు. ప్రకృతి నియమాలను అతిక్రమించినట్టయితే వాటి పర్యవసానాలను ఎదుర్కోవలసి ఉంటుంది. సుఖశాంతులకు దూరం కావలసి వస్తుంది. అందువల్ల పరిస్థితి విషమించకముందే జాగ్రత్తపడడం ఎంతయినా శ్రేయోదాయకం!

సంపుటి 87 | నవంబర్ '90 | సంచిక 5

విడి ప్రతి : 3-00 : : సంవత్సర చందా : 36-00






# కౌలుకిచ్చిన దేశం

అధిక జనాభాతో, నిత్యనూతనంగా కళకళలాడే అందాల నగరం హాంగ్-కాంగ్. చిన్న ద్వీపమయిన హాంగ్ కాంగ్ ఒక దేశం. అది బ్రిటిష్ వలస ప్రాంతం.

ఆసియాఖండ చిత్రపటాన్ని చూసినట్టయితే, హాంగ్ కాంగ్ చైనాలో ఒక భాగంగా కనిపిస్తుంది. అయినా, అది బ్రిటిష్ వలస ప్రాంతం ఎలా అయింది? అనేక సంవత్సరాలుగా బ్రిటన్, చైనాకు నల్లమందును ఎగుమతి చేస్తూ అధిక లాభాలు అర్జించింది. 1841 వ సం॥లో చైనా ప్రభుత్వం నల్లమందు దిగుమతిని నిషేధించింది. దాంతో ఆగ్రహం చెందిన






బ్రిటన్ హాంగ్ కాంగ్ ద్వీపాన్ని పట్టుకున్నది!

అయినా, తను చేసింది మంచిపని కాదని బ్రిటన్‌కు తెలుసు. కొన్ని గొడవలూ, వాదవివాదాలూ జరిగాక, హాంగ్-కాంగ్‌ను చైనా నుంచి వంద సంవత్సరాలు కౌలుకు తీసుకున్నట్టు వ్యవహరించడానికి బ్రిటన్ అంగీకరించింది.

ఆ కౌలు ఒప్పందం 1997 వ సం॥ నాటికి ముగుస్తుంది. కౌలును పొడిగించడానికి చైనా సుముఖంగా లేదు. హాంగ్ కాంగ్‌ను చైనా తనలో కలుపుకుంటుంది.

ఈనాడు హాంగ్ కాంగ్ ప్రపంచంలో ఒక ముఖ్యమైన వాణిజ్య కేంద్రంగా అభివృద్ధి చెంది వున్నది. ఆకాశాన్నంటే అద్భుత భవనాలతో, ఆడంబరమైన జీవిత విధానాలతో, అధునాతనమైన సాంకేతిక సౌకర్యాలతో చైనా కన్నా భిన్నంగా ఉంటున్నది. హాంగ్ కాంగ్‌ను ఇప్పటిలాగే స్వతంత్ర వ్యాపార కేంద్రంగా కమ్యూనిస్టు చైనా ప్రభుత్వం కొనసాగనిస్తుందా? అలాగే అనుమతించగలమని చైనా ప్రభుత్వం చెబుతున్నది. అయినా, ఈ మాటను హాంగ్ కాంగ్‌లోని పెద్ద పెద్ద వ్యాపారులు విశ్వసించడం లేదు. తమ వ్యాపార సంస్థలను సింగపూర్, బ్యాంకాక్, తాయ్‌పీ, మనీలా మొదలైన నగరాలకు తరలిస్తున్నారు.



# బంధువులున్నారు జాగ్రత్త!

ఒకానొకప్పుడు సూర్యాపురమనే గ్రామంలో రంగధాముడనే దానశీలి వుండేవాడు. ఆయన ఆదిలో గొప్ప ధనవంతుడే అయినా, తన భవిష్యత్తు గురించి ఆలోచించకుండా దానాలు చేయడంవల్ల, కొద్ది కాలంలోనే బికారి అయిపోయాడు. ఆయనవల్ల ఎక్కువగా ప్రయోజనం పొందినవాళ్ళు ఆయన బంధువులు. గ్రామంలోనే వుండి కూడా, వాళ్ళల్లో ఒక్కరూ రంగధాముణ్ణి ఆదుకునేందుకు ముందుకు రాలేదు. పైగా వాళ్ళు రంగధాముడి మీద దుష్ప్రచారం కూడా ప్రారంభించారు.

వాళ్ళ మాటలప్రకారం—రంగధాముడికి దానకర్ణుడనిపించుకోవాలన్న తాపత్రయం ఎక్కువ. వెనకా, ముందూ ఆలోచించకుండా దానాలు చేసి బికారి అయిపోయాడని కొందరంటే, రంగధాముడిది అక్రమ సంపాదన అనీ, అందుకే అది నిలవలేదనీ మరి కొందరన్నారు. ఇచ్చిన డబ్బు అచ్చిరాక తాము చెడిపోయామనీ, రంగధాముడికి సాయపడ్డవాడికి పుట్టగతులుండవనీ కొందరు ప్రచారం చేశారు.

రంగధాముడి బంధువులు కాని కొందరికి, ఆయనకు అంతో ఇంతో సాయపడాలని వున్నది. అయితే, బంధువులందరూ మూకఉమ్మడిగా చేసే దుష్ప్రచారం చూసి వాళ్ళు భయపడిపోయారు.

ఇలాంటి పరిస్థితుల్లో రంగధాముడు ఆ గ్రామంలో వుండలేక, భార్యాబిడ్డలతో దూరప్రాంతాలకు బయలుదేరాడు. వాళ్ళు కొంతదూరం ప్రయాణం చేసి, అందరూ ఒక చెట్టు కింద చతికిలబడ్డారు. పిల్లలు వెంటనే నిద్రపోయారు.

రంగధాముడి భార్య విచారంగా, ''ఏమండీ, మనం బంధువులకు ఉప

"వసుంధర"



కారమే తప్ప, అపకారం చేయలేదుకదా! వాళ్ళందరూ మన మీద పగబట్టడానికి కారణం ఏమిటి?'' అని అడిగింది.

రంగధాముడు నవ్వి, ''వెర్రిదానా! వాళ్ళు మనకు బంధువులుకాబట్టి కష్టాల్లో మనను ఆదుకోవలసిన బాధ్యత వున్నది. ఆ బాధ్యత నుంచి తప్పించుకునేందుకే వాళ్ళలా దుష్ప్రచారం ప్రారంభించారు. మనపట్ల బాధ్యత లేనివాళ్ళకు మన మిచ్చేది పుచ్చుకోవడమే తప్ప, వేరే ఆలోచన వుండదు. తెలిసిందా?'' అన్నాడు.

రంగధాముడి భార్య నిట్టూర్చి నిద్రలో పడింది. అంతలో రంగధాముడికి కూడా చిన్న కునుకు పట్టింది. ఆ కునుకులో ఆయనకొక కల! అందులో ఒక సాధువు కనిపించి, ''వెనకా, ముందూ ఆలోచించకుండా అడ్డమైన వాళ్ళందరికీ దానాలు చేయడంవల్ల, నీకీగతి పట్టింది. అయితే ఏం, నువ్వు చేసుకున్న పుణ్యం ఉట్టినే పోదు. అది రాగి ఉంగరంగా మారి, ఈ చెట్టుతొర్రలో వున్నది. నువ్వా ఉంగరాన్ని ధరిస్తే రోజూ నువ్వు కోరినంత డబ్బిస్తుంది. కానీ ముందుగా నువ్వొక పని చేయాలి. ఉంగరాన్ని ధరించి ఇక్కడికి దగ్గిర్లో వున్న కోనవరం చేరుకో. అక్కడ రచ్చబండ దగ్గిర పదిమంది మనుషులుంటారు. వాళ్ళల్లో ఒక్కడు మాత్రమే నీకు బంధువు. అడిగి తెలుసుకోకుండా నీ బంధువును నువ్వు గుర్తిస్తే, నీ వేలికున్న రాగి ఉంగరం బంగారపు టుంగరంగా మారిపోతుంది. ఆ క్షణం నుంచీ అది నీకు రోజూ కోరినంత డబ్బివ్వగలుగుతుంది. తెలిసి కూడా అపాత్రదానం చేయనంతకాలం ఉంగరం మహిమ అలాగే వుంటుంది. ఎప్పుడైతే ఉంగరం తిరిగి రాగిలోకి మారుతుందో, అప్పుడు దాని మహిమ పోయినట్టు. నీ బంధువు ఇంట ఒక్కరాత్రి మాత్రమే గడిపి, మర్నాడు నీ స్వగ్రామానికి వెళ్ళిపోవాలి. త్వరగా బయల్దేరు!'' అన్నాడు.



ఉలిక్కిపడి లేచిన రంగధాముడికి వెతికి చూస్తే చెట్టుతొర్రలో, నిజంగానే రాగి ఉంగరం ఒకటి కనిపించింది. అది ఆయన ఎడమచేతి చూపుడువేలుకు సరిగ్గా సరిపోయింది.

రంగధాముడు భార్యాబిడ్డలను నిద్ర లేపి, కోనవరం వైపు దారితీశాడు. చీకటి పడకుండానే ఆయన, ఆ గ్రామం రచ్చబండవద్దకు చేరుకున్నాడు. కలలో సాధువు చెప్పినట్లే అక్కడ పదిమంది మనుషులున్నారు. ఆశ్చర్యం! అప్పుడు వాళ్ళు రంగధాముణ్ణి గురించే మాట్లాడుకుంటున్నారు.

"మా నాన్న సూర్యాపురం వెళ్ళి గుండె నొప్పివచ్చి పడిపోతే, ఎరిగున్న వాళ్ళు కూడా ఎరగనట్టు, నటించారు. ముక్కూ మొహం తెలియనివాడెవడో ఆయన్ని వైద్యుడింటికి చేర్చితే, వైద్యుడు బాగా డబ్బు కావాలన్నాడు. తిరిగి ఇవ్వమని కూడా అడక్కుండా పెద్ద మొత్తం సాయం చేసి, మా నాన్నను బతికించాడు రంగధాముడు. ఇప్పుడాయన సూర్యాపురం వదిలి వెళ్ళిపోతాడట. మంచి వాళ్ళకు రోజులు కావివి!" అన్నాడొకడు.

అలా ఒక్కొక్కరే రంగధాముణ్ణి పొగుడుతూంటే, కేశవుడనేవాడొకడు మాత్రం, "అసలు విషయం మీకు తెలియదు. రంగధాముడి తాత ఎక్కడలేని దుర్మార్గాలూ చేసి విపరీతంగా సంపాదించాడు. ఆ పాపఫలం రాచపుండుగా మారి, ఆయన ప్రాణం తీసింది. ఆ పాపఫలం రంగధాముడి తండ్రికి కూడా రాచపుండై అంటుకున్నది. సాధువులనడిగితే, 'నీకున్నదంతా దానం చేయడం మొదలుపెట్టు. నువ్వు దానం చేసిన డబ్బులో న్యాయంగా ఆర్జించినది ఒక్క రాగినాణెం వున్నాసరే, నీ తాత చేసిన పాపం పూర్తిగా పోతుంది.' అని రంగధాముడికి చెప్పారు. ఆ విధంగా ఆయన దానాలు ప్రారంభించాడు. దానాలైతే చేస్తున్నాడు కానీ బుద్ధులు మారవు



కదా? న్యాయంగా ధనార్జన చేయడం ఆ వంశంలోనే లేదు. అందువల్లనే రంగధాముడి తండ్రి రాచపుండుతో పోయాడు. ఆయన పేదవాడైపోయాడు,'' అన్నాడు.

''అదా, సంగతి! బాగా చెప్పావు కేశవా! లేకుంటే మేమంతా నిజంగా ఆయన గొప్పదాత అనుకునేవాళ్ళం,'' అని అన్నారు మిగతావాళ్ళందరూ.

అప్పుడు రంగధాముడు, కేశవుణ్ణి సమీపించి, ''నాయనా! నా పేరు రంగధాముడు. కోనవరంలో నాకు బంధువులున్నట్టు తెలియదు. పోలికనుబట్టి నువ్వు తప్పక మా బంధువు అయి వుండాలని తోస్తున్నది,'' అన్నాడు.

ఆ వచ్చినది రంగధాముడని తెలియగానే, కేశవుడు తప్ప మిగతావాళ్ళందరూ ఆయనకు అప్రయత్నంగా భక్తిభావంతో నమస్కరించి, ''అయ్యా, తమను గురించి చాలా విన్నాం. మా అదృష్టం కొద్దీ మీ దర్శనమయింది. తమబోటి గొప్పవారికి కష్టాలు రావడం, మాకు విచారం కలిగిస్తున్నది. తమకు మేమేవిధంగా సాయపడగలమో చెప్పండి,'' అన్నారు.

అప్పుడు రంగధాముడు తన ఎడమ చేతివైపు చూసుకున్నాడు. చూపుడువేలికున్న రాగి ఉంగరం, బంగారు ఉంగరంగా మారిపోయింది.

ఆయన వాళ్ళందరితోనూ, ''బాబులూ! నేను దేనికీ ఒకరి సాయాన్ని కోరేవాణ్ణి కాను. మంచి పనులు చేసేవారిని ఏ కష్టాలూ బాధించవు. మీలో ఎవరికైనా డబ్బు అవసరం వుంటే చెప్పండి, నేనే ఇస్తాను! నాకే సాయమూ వద్దు,'' అన్నాడు.

వెంటనే వారిలో ఒకడు కళ్ళనీళ్ళతో, ''నేను షాహుకారుకు వంద వరహాలు బాకీపడ్డాను. వడ్డీతో కలిపి అది ఐదువందలయింది. రేపటికి బాకీ తీర్చకపోతే, షాహుకారు నా పొలం స్వాధీనం చేసుకుంటానన్నాడు,'' అన్నాడు.

దానికి రంగధాముడు, ''నువ్వు షాహుకారును తీసుకుని రాత్రికి మా ఇంటికిరా.

మా ఇల్లంటే—ఇదిగో ఈ కేశవుడి ఇల్లే! ఇవాళకు అక్కడే వుంటాను.'' అన్నాడు.

రంగధాముడు మళ్ళీ సంపన్నుడయా డని కేశవుడికి అర్థమైంది. వాడు భక్తి భావంతో ఆయనకు నమస్కరించి, ''నువ్వు నాకు పెదనాన్నవవుతావని, నాన్న చెప్పాడు. పద, ఇంటికి వెళదాం!'' అన్నాడు.

జరుగుతున్నదంతా రంగధాముడి భార్యాబిడ్డలకు ఆశ్చర్యంగా వున్నది. అయితే ఆ రాత్రి రంగధాముడు, కేశవుడి ఇంట్లో వుండి, ఆ గ్రామంలో డబ్బవసరం వున్న చాలామందికి సాయం చేశాడు. ఎడమచేతి చూపుడువేలికున్న బంగారు ఉంగరం ఆయనకు కోరిన డబ్బు ఇస్తున్నది. ఆ విషయం రంగధాముడు, భార్యకు చెప్పాడు.

మర్నాడు రంగధాముడు తిరిగి సూర్యాపురానికి ప్రయాణమవుతూండగా, కేశవుడి తండ్రి ఆయనవద్దకు వచ్చి, ''అన్నయ్యా! కూతురు పెళ్ళికి రెండువేల వరహాలు తక్కువయ్యాయి. నీవంటివాడు సాయపడకపోతే పెళ్ళి ఆగిపోయేలా వున్నది,'' అన్నాడు.

''నీకు తప్పక సాయపడతాను. వెంటనే గ్రామాధికారి వద్దకు వెళ్ళి, ఋణపత్రాలు రాయించుకుందాం, పద!'' అన్నాడు రంగధాముడు.



''ఋణపత్రమా? అంటే నువ్వు నాకు సాయం చేయవన్నమాట. అప్పిస్తావన్న మాట, అవునా?'' అన్నాడు కేశవుడి తండ్రి తెల్లబోయి.

''సాయం పుచ్చుకునేవాడు బిచ్చగాడవుతాడు. నా బంధువుల్నీ, స్నేహితుల్నీ బిచ్చగాళ్ళుగా చూడలేనుకదా! అందుకే అప్పిస్తాను,'' అన్నాడు రంగధాముడు.

''పోనీ, అప్పిస్తే మాత్రం ఆయిన వాళ్ళకు పత్రాలెందుకు? నోటిమాట చాలదా?'' అన్నాడు కేశవుడి తండ్రి.

''నువ్వెవరికైనా నోటిమాట మీద అప్పిచ్చి చూడు. నా బాధ తెలుస్తుంది,'' అన్నాడు రంగధాముడు.

కేశవుడి తండ్రి మౌనంగా వూరుకున్నాడు. రంగధాముడి నుంచి అప్పు మాత్రం తీసుకోలేదు.

అక్కడి నుంచి తిరుగు ప్రయాణమయ్యాక, దారిలో మళ్ళీ అదే చెట్టు కింద విశ్రాంతి తీసుకున్నారు రంగధాముడూ, భార్యాబిడ్డలు. పిల్లలు నిద్రపోయారు. అప్పుడు రంగధాముడి భార్య, భర్తను, "అందరికీ సాయం చేసిన మీరు, మీ తమ్ముడి కెందుకు సాయం చేయలేదు?" అని అడిగింది.

"వెర్రిదానా! వాడు నా దగ్గిర డబ్బుంది కదా అని అడిగాడు తప్ప, అవసరమై అడగలేదు. నిజంగా అవసరంలో వున్నవాడు ఋణపత్రం రాసైయినాసరే అప్పు తీసుకుంటాడు. అర్థమయిందా? తెలియనివాడెవడైనాసరే నన్ను సాయమడిగాడంటే, వాడు నిజంగా అవసరంలో వుండివుండాలి. కొందరు మోసగాళ్ళు కూడా వుండవచ్చు. కానీ మనకు తెలియనంతకాలం, ఎవరినీ మోసగాళ్ళుగా భావించకూడదు. అలా భావించడంవల్ల ఎందరో మంచివాళ్ళకూ్కడా మనం సాయపడలేకపోతాం. ఇక బంధువులూ, స్నేహితులూ అంటావా? వాళ్ళకు ఋణపత్రాలు లేకుండా అప్పివ్వడం మంచిది కాదు. అర్థమయిందా?" అన్నాడురంగధాముడు.

ఈ సమాధానానికి తృప్తిపడి రంగధాముడి భార్య నిద్రపోయింది. తర్వాత రంగధాముడు చిన్నకునుకు తీస్తూండగా, అప్పుడు కలలో మళ్ళీ సాధువు కనిపించి, "అడిగినవాళ్ళందరికీ దూరాలోచన లేకుండా చేసిన, నీ పాత దానాలకంటే, బుద్ధికలిగిచేసే ఇప్పటి నీ దానాలే గొప్పవి. కోనవరంలోని బంధువును గుర్తించగానే, నీకు బుద్ధివచ్చినట్టు తెలిసింది నాకు. ఇక మీదట ఇదే విధంగా నువ్వెన్ని దానాలు చేసినా పేదరికం నీ దరిదాపులకురాదు!" అని మాయమయ్యాడు.

తర్వాత సూర్యాపురం చేరుకున్న రంగధాముడు ఎంతో కాలం మంచి పేరుప్రతిష్ఠలతో సుఖంగా జీవించాడు.





# బందిపోటు యువరాజు

## 15

[జయపురి రాజు శంకరవర్మ, తమ పూర్వుల శిథిల భవనాల నుంచి బయటపడిన కనకదుర్గ బంగారు విగ్రహాన్ని, వీరసింహుడికి అప్పగించడానికి నిరాకరించాడు. వీరసింహుడి సేనాధిపతి సర్పదంతుడు కొందరు సైనికులతో వచ్చి, విగ్రహాన్ని బలవంతంగా తీసుకుని, పడవలో వెళుతూన్నప్పుడు—ఎవరో హఠాత్తుగా పడవలోకి దూకి, దానిని ఎత్తుకుపోయారు. —తరవాత]

"ఆగండి!" అని అరుస్తూ సర్పదంతుడు పడవను సమీపించి. "ఎక్కడ బందిపోటు? పడవ వెనకే ఈదుకుంటూ రావడానికి వాడేమీ మొసలి కాదు కదా! వాడు మిమ్మల్ని సమీపించినప్పుడు మీరందరూ నిద్రపోయారా? లేక కలలు కంటున్నారా?" అని గద్దించాడు.

"ప్రభూ, బందిపోటు ఆ విగ్రహాన్ని ఎత్తుకుని రెప్పపాటులో అరణ్యంలోకి పారిపోయాడు!" అన్నారు పడవలోని భటులు గట్టు మీదికి దిగుతూ.

వాళ్ళు చెప్పిన విషయం అర్థం చేసుకోవడానికి సర్పదంతుడికి కొంత సేపు పట్టింది. ఒక చేత్తో తాడు పట్టుకుని పడవలోకి దూకి, మరొక చేత్తో అంత బరువైన విగ్రహాన్ని అవలీలగా ఎత్తుకుని అవతలి గట్టుకు చేరడం సర్పదంతుడికి నమ్మశక్యంగా లేదు. ఆ బంగారు విగ్రహాన్ని



శంకరవర్మ భవనం నుంచి నలుగురు దృఢకాయులయిన భటులు, మోయలేక మోసుకుంటూ వచ్చి, నదీతీరం చేర్చారు. అంత బరువయిన విగ్రహాన్ని, ఒక చేత్తో అవలీలగా ఎత్తుకుని అవతలి గట్టును ఎలా చేరగలిగాడా వ్యక్తి?

సైనికులు తలలు వంచుకుని సర్పదంతుడి ముందు నిలబడ్డారు.

సులభంగా తమ వశం అయిందనుకున్న విలువయిన ఆ బంగారు విగ్రహం హఠాత్తుగా చేజారిపోయిందన్న బాధవల్ల కలిగిన ఆగ్రహంతో, సర్పదంతుడు పక్కనున్న ఒక భటుణ్ణి లాగి లెంపకాయ కొట్టి, "ఎవడో అనామకుడు వచ్చి, నిక్షేపంలాంటి విగ్రహాన్ని ఎత్తుకుపోతూ వుంటే మీరంతా నిద్రపోయారా?" అని కేకలు వేశాడు.

చెంపదెబ్బ తిన్న సైనికుడు అవమానంతో కుంచించుకుపోయాడు. అతనికి దెబ్బ మీద దెబ్బ. ఎందుకంటే విగ్రహాన్ని ఎత్తుకుపోతూ, ఆ వ్యక్తి కూడా అదే సైనికుణ్ణి ఒక తాపు తన్నాడు. అయినా— బందిపోటు పడవ మీదికి దూకినప్పుడు, నదికి ఇరువైపులా ఆయుధాలు ధరించి నడుస్తూన్న సైనికులు సైతం అతన్ని పట్టుకోలేకపోయారు. అలాంటప్పుడు తను మాత్రం ఎలా పట్టుకోగలనని సర్పదంతుడితో చెబుదామనుకున్నాడు సైనికుడు. కాని అలా చెప్పడానికి ధైర్యం చాలలేదు. అందువల్ల అతడు తెలివిగా, "ప్రభూ! ఇంతమంది యోధుల కళ్ళు కప్పి, కేవలం ఒక మానవుడు ఆ విగ్రహాన్ని ఎత్తుకుని వెళ్ళడం సాధ్యమని మీరు భావిస్తున్నారా?" అని అడిగాడు.

"అంటే, ఏమిటి నీ ఉద్దేశం?" అని అడిగాడు సర్పదంతుడు.

"ఏదో దుష్టశక్తి ఆ విగ్రహాన్ని అపహరించుకుని వెళ్ళిందే తప్ప కేవలం బందిపోటు కాదు!" అన్నాడు భటుడు.

"అలాగా!" అని సర్పదంతుడు కొంతసేపు మౌనంగా ఆలోచించి, "అయితే, ఆ

విషయం నువ్వే మన రాజు సమక్షంలో చెప్పు," అన్నాడు.

శాంతిపురం వెళ్ళి, వీరసింహుడితో సర్పదంతుడూ, భటులూ—చుట్టూ కటిక చీకటి కమ్ముకున్న అర్ధరాత్రి సమయంలో భూతం వంటి భయంకరాకారం ఒకటి హఠాత్తుగా పడవలోకి దూకి తృటిలో విగ్రహంతో సహా మాయమైపోయిందని గోరంతలు కొండంతలు చేసి చెప్పారు.




వీరసింహుడికి వారి మాటలు నమ్మశక్యం కాలేదు. అయినా, అతడు ఇటీవల అన్నిటా అపజయాలనే ఎదుర్కోవలసి వస్తున్నది. ఒకవేళ ఎవరైనా తన మీద మంత్రప్రయోగం, చేతబడి లాంటివేమైనా చేశారా? అలా చేసి ఉంటే వాటిని సరిదిద్దడం ఎలా? తనను ఈ బాధల నుంచి కాపాడగల సమర్థుడయిన మాంత్రికుడుగాని, భూతవైద్యుడుగాని ఎక్కడ వున్నాడో అని వీరసింహుడు తీవ్రంగా ఆలోచించసాగాడు.

* * *

జయపురిని విషాదం కమ్ముకున్నది. కొత్తగా కట్టిన గుడిలో కనకదుర్గ విగ్రహాన్ని ప్రతిష్ఠించాలని ఆనందోత్సాహాలతో వున్న ప్రజలకు, సర్పదంతుడి చర్య దిగ్భ్రాంతిని కలిగించింది. సుమేధ రాజ్యాన్ని పరమదుర్మార్గుడు పాలిస్తున్నాడని తెలుసుగాని, వాడి క్రూరదృష్టి తమపై పడుతుందని వారు ఊహించలేకపోయారు!

శంకరవర్మ ఒక గదిలో మౌనంగా కూర్చున్నాడు. ఆయనను సమీపించడానికి ఎవరూ సాహసించలేక పోయారు. కాని శంకరవర్మ ఏకైక కుమార్తె సుకన్య నెమ్మదిగా తండ్రిని సమీపించి, "నాన్నా, ఆ దేవత మళ్ళీ మన దగ్గరికి తిరిగి రాగలదని నాకు అనిపిస్తున్నది." అన్నది మధురస్వరంతో.

శంకరవర్మ విచారంతో చిన్నగా నవ్వాడు.



కనకదుర్గ విగ్రహం పట్ల సుకన్య ఎంతో ప్రేమను పెంచుకున్నది. శంకరవర్మ, విగ్రహ ప్రతిష్ఠాపన ఉత్సవం కోలాహలంగా జరపాలని నిర్ణయించడానికి ముఖ్య కారణమే సుకన్య. అటువంటి విగ్రహం శత్రువుల వశం కావడంతో ఆమె చెప్పలేనంతగా బాధపడింది. అయినా, ఆమె తన బాధ బయటకు కనిపించకుండా తండ్రిని ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నది. ఆ సంగతి గ్రహించిన శంకరవర్మ, పొంగిపొరలుతూన్న దుఃఖాన్ని బలవంతంగా ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ, కుమార్తెను ఓదార్పుగా దగ్గరికి తీసుకున్నాడు.

"నాయనా!" అన్న కంఠస్వరం వినిపించింది.

శంకరవర్మ ఆశ్చర్యంగా తల పైకెత్తి చూశాడు. జయానంద ముని ఆశ్రమంలోని చిలుక మళ్లీ, స్తంభం మీద కూర్చుని వున్నది.

శంకరవర్మ లేచి నిలబడ్డాడు. చిలుక స్తంభంపైనుంచి నేల మీదికి దూకి, మళ్ళీ ఎగిరి ఒక దీప స్తంభం మీద కూర్చుని వెనక్కు తిరిగి చూసింది. మళ్లీ తనను పిలుస్తున్నదని గ్రహించిన శంకరవర్మ, దానిని అనుసరించి ముందుకు నడిచాడు. అతని వెంట సుకన్య కూడా బయలుదేరింది.

కొంతసేపటికి చిలుక ఉద్యానవనం చేరింది. పిండార బోసినట్టు వెన్నెల కాస్తున్నది. చిలుక ఒక దానిమ్మచెట్టు కొమ్మపై వాలింది. శంకరవర్మ చిలుక కేసి చూస్తూ నడుస్తున్నప్పుడే సుకన్య, "చూశావా నాన్నా, దేవత మళ్ళీ మన దగ్గరికే చేరింది!" అన్నది ఉత్సాహంగా.

సర్పదంతుడు తీసుకుపోయిన కనకదుర్గ బంగారు విగ్రహం దానిమ్మచెట్టు కింద కనిపించింది. సుకన్య గబగబా వెళ్ళి, విగ్రహం దగ్గర కూర్చుని, ఆనంద బాష్పాలు రాలుస్తూ, "నాన్నా, నేను చెప్పాను కదా, దేవత మళ్ళీ మన దగ్గరికి

వస్తుందని. ఇప్పుడు చూశావా?'' అన్నది పట్టరాని ఉత్సాహంతో.

శంకరవర్మ ఏమీ మాట్లాడలేదు. చేజారి పోయిన విగ్రహం తిరిగి వచ్చిందన్న మాట నిజమే. అయినా, అది ఇక్కడికి ఎలా వచ్చింది? దానిని ఇక్కడికి తీసుకు వచ్చినవారెవరు? అని ఆలోచిస్తూ శంకర వర్మ చుట్టుపక్కల కలయజూశాడు.

మల్లి కిలకిలా నవ్వింది. శంకరవర్మ అటుకేసి తిరిగి చూశాడు. చెట్టు వెనక నుంచి వస్తూన్న ఒక అందమైన యువకుడి భుజం మీద మల్లి కూర్చుని వున్నది!

ఆ యువకుడు శంకరవర్మను సమీపించి, ఆయనకు నమస్కరించి, ''మీకు నేనెవరో తెలియదు. అయినా, మిమ్మల్ని గురించి గురుదేవులు జయానందముని నాకు చెప్పారు!'' అన్నాడు.

''నువ్వు యువరాజు సందీపుడే కదా?'' అన్నాడు శంకరవర్మ అమితానందంతో.

''అవును, మీ సేవకుణ్ణి!'' అన్నాడు యువరాజు సందీపుడు.

మరుక్షణమే శంకరవర్మ యువరాజును ఆప్యాయంగా కౌగిలించుకుని, ''నీ దర్శనం కోసం ఎంతగా తపించిపోతున్నానో తెలుసా? ఇన్నాళ్ళకు నా కోరికను నెరవేర్చినందుకు ఆ దేవుడికి కృతజ్ఞులు చెప్పాలి. అయినా, సర్పదంతుడు పట్టుకుపోయిన ఆ విగ్రహం మళ్ళీ ఇక్కడికి ఎలా వచ్చిందో అంతుబట్టడం లేదు!'' అన్నాడు.





''ఆ కనకదుర్గ విగ్రహాన్ని తెచ్చి మీకు అప్పగించే మహాభాగ్యం నాకే కలిగింది!'' అన్నాడు యువరాజు సందీపుడు.

''అలాగా! ఎలా తెచ్చావు?'' అని అడిగాడు శంకరవర్మ.

విగ్రహాన్ని పడవలో తీసుకుపోతూన్న సర్పదంతుడి భటులనుంచి ఎలా తీసుకు వచ్చిందీ క్లుప్తంగా తెలియజేశాడు సందీపుడు. అంతావిన్న శంకరవర్మ, ''అయినా, ఇంత బరువయిన విగ్రహాన్ని ఒక్క చేత్తో ఎలా ఎత్తగలిగావు?'' అని అడిగాడు అమితాశ్చర్యంతో.

''ఆ సంగతి తలుచుకుంటే నాకూ అశ్చర్యంగానే ఉన్నది. మరొకసారి అలాంటి పని చేయగలనా అన్నది అనుమానమే. అయితే, నేనాపని చేసినప్పుడు ఏదో ఒక వింతశక్తి నన్నూ, నా చేతులనూ అవహించినట్టు భావిస్తున్నాను. అయితే, ఆ వింతశక్తి ఎక్కడి నుంచి వచ్చింది మాత్రం తెలియడం లేదు!'' అన్నాడు సందీపుడు.

''ఆ మహత్తరశక్తి దేవత నుంచే వచ్చి వుంటుంది. ఆమె మళ్ళీ ఇక్కడికి రావాలని సంకల్పించింది. మీ ద్వారా ఇక్కడికి చేరింది.'' అన్నది సుకన్య మధురమైన కంఠస్వరంతో.

సందీపుడు సుకన్య కేసి ఆశ్చర్యంగా చూశాడు. దానిని గమనించిన శంకరవర్మ మందహాసం చేస్తూ, ''యువరాజా, ఆమె నా కుమార్తె సుకన్య. యువరాజుతో ఎలా మాట్లాడాలో తెలియదు. ఇకమీదటే నేర్చుకోవాలి!'' అన్నాడు.

''అయినా, నిజం మాట్లాడడం ఆమెకు నేర్పనవసరం లేదు కదా!'' అంటూ నవ్వాడు యువరాజు.

శంకరవర్మ కుమార్తెతో, ''సుకన్యా, యువరాజు ప్రస్తుతం మన అతిథి. ఆయనకు సకల మర్యాదలు చేయడం మన కర్తవ్యం.'' అన్నాడు.

''నేను మీతో రాజభవనానికి రావడానికి సిద్ధమే. అయితే, అక్కడే చాలాసేపు

ఉండలేను. ఎందుకంటే నా రాకకోసం నా మిత్రులు అదుర్దాగా ఎదురుచూస్తూ వుంటారు. మరొక ముఖ్యమైన విషయం ఏమంటే, వీరసింహుడు ఏక్షణాన్నయినా మీమీదికి సైన్యాన్ని పంపవచ్చు. నేనూ, నా మిత్రులూ మీకు రక్షణ కల్పించడానికి శాయశక్తులా కృషి చేస్తాము. అయినా, మీరూ అప్రమత్తులై ఉండాలి,'' అని చెబుతూ యువరాజు సందీపుడు శంకరవర్మ వెంట రాజభవనంలో ప్రవేశించాడు.

యువరాజు ఆసనంలో కూర్చున్న తరవాత, సుకన్య ఆయనకు పళ్ళూ, ఫలహారాలూ తేవడానికి లోపలికి వెళ్ళింది. అప్పుడు శంకరవర్మ సందీపుడితో, ''యువరాజా, నా భద్రత గురించి నాకు అంతగా విచారం లేదు. అయితే నీ భద్రత చాలా ముఖ్యం. నిజం చెప్పాలంటే వీరసింహుడు ప్రాణాలతో ఉన్నంతవరకు నీకు రక్షణ ఉండదు. ఆ దుర్మార్గుణ్ణి ఇంకా సహించడం మంచిది కాదను కుంటాను. ఆ పరమ కర్కోటకుడి అంతు చూడడానికి ఇదే సరైన తరుణం,'' అన్నాడు.

''వీరసింహుణ్ణి హతమార్చడానికి మాకు చాలా అవకాశాలు లభించాయి. అయినా వాణ్ణి యుద్ధంలో ఓడించాలన్నదే నా ఆశయం. వాడు నా తండ్రిని కుట్రపన్ని హతమార్చిన మాట వాస్తవమే. అయినా, అదే పద్ధతిలో వాణ్ణి చంపాలని నేను ఆశించడం లేదు. వాడు మాతో యుద్ధం చేసి సైనికబలాన్నంతా కోల్పోయి ఆ పైన మరణించాలి. ఒకవేళ యుద్ధంలో నేనే ఓడిపోతే, ఓటమిని మనస్ఫూర్తిగా అంగీకరిస్తాను,'' అన్నాడు సందీపుడు ఎంతో గంభీరంగా.

పళ్ళెం నిండా పళ్ళూ, ఫలహారాలతో గదిలోకి అడుగుపెట్టడానికి వచ్చిన సుకన్య యువరాజు మాటలు విని, అతని వెనక అలాగే నిలబడిపోయింది. యువరాజు మాటలకు శంకరవర్మ పరమానందం చెందాడు. —(ఇంకావుంది)





# దేవతాస్త్రీవరం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీలో వున్న పట్టుదలా, ఎన్ని కష్టాలనైనా ఎంతో ఓర్పుతో భరించగల శక్తీ చూస్తూంటే, నాకు ఆశ్చర్యం కలుగుతున్నది. నువ్వు మరెవరికో ఏదో కార్యం సాధించిపెడతానని వాగ్దానం చేసి, వాగ్దాన భంగం ఇష్టం లేక, ఇన్ని శ్రమలకు తల ఒగ్గుతూండవచ్చు. మనుషులు తమ వాగ్దానాలనూ, దేవతలు తమ వరాలనూ ఏ పరిస్థితులలోనూ భంగపుచ్చరాదు. అసూయాద్వేషాలకొద్దీ, ఇందుకు భిన్నంగా ప్రవర్తించిన, ఒక దేవతాస్త్రీ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



చక్రధరపురంలో వుండే చంద్రకాంతుడనేవాడికి, అతి బాల్యంలోనే తల్లిదండ్రులు పోయారు. తర్వాత వాడు, ముసలి అవ్వ పెంపకంలో బాధ్యత తెలియకుండా పెరిగి పెద్దవాడయ్యాడు. వాడికి తండ్రి ద్వారా సంక్రమించిన పది ఎకరాల బంజరుపొలం తప్ప, వేరే ఆస్తిపాస్తులంటూ ఏమీ లేవు.

ఒకనాటి రాత్రి చంద్రకాంతుడు తను వుంటున్న పూరిపాకలో ఎంతకూ నిద్ర పట్టక, బంజరుపొలంలోకి పోయి పడుకున్నాడు. వాడికి రోజులు గడవడం అనేది, దూరంగా కనిపిస్తున్న కారడవిలా భయంకరంగా తోచింది. కొంతసేపటికి చంద్రోదయమై, చల్లటిగాలి వీచసాగేసరికి వాడికి నిద్రపట్టింది.

చాలా రాత్రి గడిచాక, దాపుల శ్రావ్యమైన పాట వినిపించి చంద్రకాంతుడు మేలుకున్నాడు. ఒక సౌందర్యవతి ఆకు పచ్చరంగు దుస్తులతో, విలువైన పచ్చలు ధరించి, తనకేసి రావడం వాడి కంట బడింది.

వాడు, ఆమెను ఏదో దేవతాస్త్రీగా గుర్తించి, "నీకేం, తల్లీ! కష్టాలంటే ఏమాత్రం తెలియనిదానివి. అందువల్లనే పుచ్చపువ్వు లాంటి ఈ వెన్నెలలో హాయిగా పాడుకుంటూ తిరగ గలవు. అన్ని కష్టాలూ, మా మనుషులకే గదా!" అన్నాడు.

ఆ దేవతాస్త్రీ చంద్రకాంతుణ్ణి పరికించి చూసి, "చూడబోతే ఇంకా ఇరవయ్యేళ్ళయినా నిండని యువకుడిలా వున్నావు. అప్పుడే జీవితంపట్ల ఇంత విరక్తి కలిగిందా! స్వయంశక్తిని నమ్ముకుని, పట్టుదలగా కృషి చేస్తే, ఏ మనిషీ నిరాశకు గురికానవసరం లేదు. ఇంతకూ నీకొచ్చిన కష్టమేమిటి?" అని అడిగింది ఎంతో ఆప్యాయంగా.

చంద్రకాంతుడు తన దీనస్థితి గురించి ఆమెకు వివరంగా తెలియచెప్పి, "ఇప్పుడు చెప్పు, తల్లీ! నేను నిరాశా

పిశాచికి దాసోహం అనక చేయగలిగిందేమిటి ?'' అన్నాడు.

ఆ జవాబుకు దేవతాస్త్రీ చిన్నగా నవ్వి, ''నీ మూర్ఖత్వం చూస్తూంటే నాకు జాలి వేస్తున్నది. ఇప్పుడు నువ్వున్న భూమి, నీదే గదా! కష్టించి పనిచేసి ఇందులో ఏవైనా పంటలు పండించలేవా ?'' అని అడిగింది.

''తల్లీ, ఇది ఒట్టి బంజరుపొలం. ఎంత కష్టించితేమాత్రం, ఏ విత్తనమయినా మొలకెత్తుతుందా !'' అన్నాడు చంద్రకాంతుడు.

''ఆ మాటా నిజమే !'' అని దేవతాస్త్రీ ఒక క్షణకాలం ఆలోచించి, ''నిజంగా నీకు స్వయంకృషిలో నమ్మకం వుంటే, నీకొక వరం ఇస్తాను. నువ్వు నీ చేత్తో, ఈ నేలలో వేసిన ఏ విత్తనమయినా తప్పక మొలకెత్తుతుంది. ఇక నీ కృషి ప్రారంభించు! అయితే, నా వరానికి ప్రతిఫలంగా నన్ను నా ఇష్టం వచ్చినప్పుడు, ఈ ప్రదేశంలో తిరగనిస్తూ, వింధ్యవాసిని పూజకు పూలు కోసుకోనివ్వాలి. ఈ పొలంలో ఒక పక్కన అన్నీ పూల మొక్కలే వేయాలి. ఆ సంగతి మరిచేవు!'' అన్నది.

చంద్రకాంతుడు సంతోషంగా ఇందుకు అంగీకరించాడు.



ఆ తర్వాత వాడు నెల తిరక్కుండానే బంజరుపొలాన్ని శ్రద్ధగా దున్ని బాగు చేసి, ఒకపక్క చెరుకూ, మరొకపక్క అన్నిరకాల ఫలవృక్షాలూ, వేరొకపక్క పూలమొక్కల విత్తులూ నాటాడు. ఆ పొలంలోనే తనకోసం ఒక చిన్న పూరిపాక వేసుకున్నాడు.

కొన్నాళ్ళకు వాడు నాటిన ప్రతి విత్తనం మొలకెత్తి, బంజరుభూమి కాస్తా పచ్చగా కన్నులపండుగగా కనిపించసాగింది. పూలమొక్కలు పుష్పించడం ప్రారంభమైంది.

ఒకనాడు చంద్రకాంతుడు రాత్రివేళ పాకలో నిద్రపోతూండగా, పరిచితమైన



దేవతాస్త్రీ పాటకు నిద్రాభంగం కలిగి, మెల్లగా లేచి పాకలోనుంచి బయటికి వచ్చాడు.

సుగంధాలు వెదజల్లుతున్న పూల మొక్కల మధ్య ఆనందంగా తిరుగుతూ, తనకు కావలసిన పువ్వులు కోసుకుంటున్నది, దేవతాస్త్రీ.

ఆమె చంద్రకాంతుడు తనను సమీపించగానే, ''చూశావా, మనిషి శ్రమకోర్చి పని చేయగలిగితే సాధించలేనిది ఏమీ లేదు,'' అన్నది చంద్రకాంతుణ్ణి మెచ్చుకుంటూ.

''అంతా నీ వరప్రభావమే, తల్లీ!'' అన్నాడు చంద్రకాంతుడు.

''అలా అనకు. నీది బంజరుభూమి కాబట్టి, నా వరం అవసరం అయింది. అదే భూమి మంచిదయితే, నా వరంతో పని లేకుండానే విత్తనాలు మొలకెత్తి మంచి ఫలసాయాన్నిస్తాయి. కావలసింది పని మీద శ్రద్ధ, పట్టుదల,'' అన్నది దేవతాస్త్రీ.

అది మొదలు తరుచూ ఆ దేవతాస్త్రీ, మొక్కలను ఆప్యాయంగా సవరిస్తూ రాత్రివేళల్లో స్వేచ్ఛగా చంద్రకాంతుడి పూలతోటలో తిరుగుతూండేది. అందువల్లనే కావచ్చు—ఐదేళ్ళకు కాని కాపు పట్టని ఫలవృక్షాలు, రెండు సంవత్సరాలకే నిండుగా కాపుపట్టాయి. చెరుకు, వరి పంటలు పుష్కలంగా పండడంతో, చంద్రకాంతుడు ఏనాడూ కళ్ళ జూడనంత ధనం, వాడి పాకలో పోగుపడింది.

అంత ధనం చూడగానే వాడికి, తన పూరిపాక మీద రోతపుట్టింది. వాడు దాని స్థానంలో పెద్ద డాబాఇల్లు కట్టించాడు. అయితే, స్థలం చాలక కొన్ని పూలమొక్కలనూ, ఫలవృక్షాలనూ నరికించాడు. ఒక రాత్రి దేవతాస్త్రీ నరికిన ఒక చెట్టు మోదు మీద కూర్చుని చుట్టూ కలయచూస్తూ కన్నీరు కార్చసాగింది. చంద్రకాంతుడు, ఆమెను చూసి కూడా చూడనట్టు, తన డాబాలోకి వెళ్ళిపోయాడు.

తనవద్ద డబ్బు బాగా చేరడంతో, వాడు పొలం పనులు చేసేందుకు చాలా మంది పనివాళ్ళను పెట్టుకున్నాడు. పూల తోటపని కూడా తోటమాలులకు అప్పగించాడు. ఈ విధంగా కావలసినంత తీరిక దొరకడంతో, వాడు గ్రామంలోని రచ్చబండ దగ్గిరచేరి ఉబుసుపోని కబుర్లతో కాలం వృథా చెయ్యసాగాడు.

ఒకనాటి రాత్రి దేవతాస్త్రీ వాడితో "ఈ చుట్టుపక్కల చాలామంది మనుషులు మెసులుతూండడంతో, నాకు తోటలో స్వేచ్ఛగా తిరగడానికి ఇబ్బందిగా వుంటున్నది. మునుపటిలా పూలతోట పనులు—పాదులుచేయడం, నీళ్ళు పోయడం నువ్వే చేయడం బావుంటుంది," అన్నది.

అందుకు చంద్రకాంతుడు విసుగ్గా, "నాకు మునుపటి తీరికలేదు; ఓపిక అంతకన్నాలేదు. అయినా, పూలతోటలో పాదులమధ్య మన్ను పిసుకుతూ కూర్చోవలసిన ఖర్మ నాకేం! సరే, ఇకనుంచి రాత్రివేళ తోటలో మనుషులు తిరక్కుండా ఏర్పాటు చేస్తాను," అన్నాడు.

దేవతాస్త్రీ మరి మాట్లాడలేదు.

ఇది జరిగిన మర్నాడు, రాజోద్యోగి ఒకడు మరొక గ్రామం వెళుతూ, రాత్రికి చంద్రకాంతుడి గ్రామంలో బసచేశాడు. చంద్రకాంతుడు అతడికి గొప్పగా విందు ఏర్పాటు చేశాడు. ఆ సమయంలో వాడికి, రాజోద్యోగి ద్వారా ఒక సంగతి తెలిసింది. రాజుగారు నాలుగు సంవత్సరాలుగా వీపు





మీద, ఏదో మానని పుండుతో బాధపడుతున్నాడు. ఎందరు వైద్యులూ దాన్ని కుదర్చలేకపోయారు. అయితే, ఈ మధ్య ఒక బైరాగి ఆయనను పరీక్షించి, హిమాలయాలలో అరుదుగా పూసే ఒక పుష్పాన్ని తెప్పించి, పుండుమీద రుద్దితే వెంటనే గుణమిస్తుందని చెప్పాడు. కాని, అంత దూరంనుంచి ఎండిపోకుండా, ఆ పుష్పాన్ని తేవడం సాధ్యపడదు కాబట్టి, తన వెంట ఎవరినైనా పంపితే, దాని విత్తనాన్ని యిచ్చి పంపుతానన్నాడు. ఆ బైరాగి వెంట వెళ్ళిన మనుషులు, సంవత్సరం కిందట ఒక విత్తనాన్ని తెచ్చారు. ఇక్కడి వాతావరణం కారణంవల్లనో ఏమో, ఆ విత్తనం బాగా పుచ్చిపోయింది. ఇక చేసేది లేక రాజుగారు, తన వ్యాధి నయంచేసినవాడికి అర్ధ రాజ్యం యిస్తానని చాటింపు వేయించాడు.

ఇది విన్న చంద్రకాంతుడు, ఆ మర్నాడే రాజధానికి బయలుదేరివెళ్ళి, రాజును దర్శించి, ''మహారాజా! ఆ పుచ్చిపోయిన విత్తనాన్ని, నాకిప్పించండి. దానిని మొలకెత్తించి, పువ్వు పూయించి, మీ బాధ తొలగేలా చేసే బాధ్యత నాది,'' అన్నాడు.

రాజు వాడికి పుచ్చిపోయిన విత్తనం యిప్పించాడు. వాడు దాన్ని తీసుకుని గ్రామం చేరి, స్వయంగా తన డాబా పక్కన పాదుచేసి, విత్తనం నాటాడు. ఆ విత్తనం మొలకెత్తి, సాయంత్రానికల్లా మొగ్గతొడిగి, తెల్లవారేసమయంలో ఒక బంగారు కాంతితో మెరిసే పువ్వును పూచింది.

ఆ వేళకు అక్కడికి వచ్చిన దేవతాస్త్రీ, ఆ పుష్పాన్ని చూసి, ''అహాఁ, అద్భుతమైన పుష్పం! దీనిని దేవీపూజకు ఉపయోగిస్తాను,'' అంటూ తుంచబోయింది.

చంద్రకాంతుడు ఆమెకు అడ్డుపడుతూ, ''ఆగాగు! దాన్ని నీకివ్వను. ఆ పువ్వు నన్ను అర్ధరాజ్యానికి రాజును చేయబోతున్నది,'' అన్నాడు.

ఈ జవాబుకు దేవతాస్త్రీ ఆశ్చర్యపోయి, ''ఈ తోటలో పూసిన ఏ పువ్వునయినా,

నేను కోసుకుంటానని, నీకు లోగడ చెప్పాను గదా!'' అన్నది.

''ఆ ప్రసక్తి ఇప్పుడెందుకు? నేను కాబోయే రాజును!'' అన్నాడు చంద్రకాంతుడు ధీమాగా.

''అలాగా! సరే, నీ యిష్టం!'' అని చెప్పి మరుక్షణమే దేవతాస్త్రీ అదృశ్యురాలయింది.

చంద్రకాంతుడు ఏమాత్రం చలించక, పుష్పాన్ని కోసుకుని సంతోషంగా రాజధానికి వెళ్ళాడు. ఐతే అక్కడ వాడికి నిరాశ ఎదురయింది. జనం వీధుల్లో గుంపులుగా చేరి, రాజుగారు మరణించినట్టు చెప్పుకుంటున్నారు. వాడు పుట్టెడు దుఃఖంతో తిరుగుప్రయాణమై ఇల్లు చేరాడు. తోటలో వున్న ప్రతి చెట్టూ, మొక్కా వాడిపోయి వుండడం వాడి కంటబడింది.

ఆ తర్వాత చంద్రకాంతుడు నాటిన ఏ విత్తనం కూడా మొలకెత్తడం అంటూ జరగలేదు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, దేవతాస్త్రీకి చంద్రకాంతుడి మీద కోపం రావడానికి కారణం, చంద్రకాంతుడు రాజు కాబోతున్నాడన్న అసూయేగదా? తను కోరిన ఒక పుష్పాన్ని ఇవ్వ నిరాకరించినంత మాత్రాన, ఒక మనిషిని బికారిని చేయడం దేవతవంటిదానికి తగునా? ఇది న్యాయవిరుద్ధం, స్వార్థపూరితం అనిపించుకోదా? ఈ సందేహాలకు సమాధానం



తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దేవతాస్త్రీ ప్రవర్తించిన తీరులో అసూయా, స్వార్థాలంటూ ఏమీ లేవు. తిండీ, బట్టా, నిలవనీడా లేక అలమటించే చంద్రకాంతుడికి, ఆమె ఎంతో దయాగుణంతో మేలు కలిగించింది. అందుకు ప్రతిఫలంగా ఆమె కోరింది, పూజకోసం తోటలో తన కిష్టమైన పువ్వులు కోసుకోవడం. ఇందుకు చంద్రకాంతుడు ఒప్పుకున్నాడు. అయితే, ధనం పోగవుతున్నకొద్దీ వాడిలో సోమరితనంతో పాటు, స్వార్థం కూడా పెరగసాగింది. అందువల్లనే వాడు పొలం పనిపాటుల్ని పనివాళ్ళకు వదిలి, గ్రామంలోని రచ్చబండ దగ్గిర వ్యర్థమైన కబుర్లతో కాలక్షేపానికి పూనుకున్నాడు. అర్ధరాజ్యాన్ని సంపాయించి రాజు కావాలనే దురాశకొద్దీ వాడు, తనకు మేలుచేసిన దేవతాస్త్రీకి పువ్వును ఇవ్వనిరాకరించి కించపరిచాడు. వాడిలోని స్వార్థం, ఒక దేశానికి రాజును కావాలన్నంతవరకూ పెరిగిపోయింది. అలాంటి స్వార్థపరుడు రాజైతే, తన పాలనలో వున్న పౌరులకే గాక, ఇరుగుపొరుగు రాజులకు కూడా ప్రమాదకారుడు కాగలడు. చంద్రకాంతుడు రాజధాని చేరేసరికే రాజు మరణించడం అనేది కాకతాళీయం మాత్రమే. తన స్వార్థం కొద్దీ దేవతాస్త్రీని ఏక్షణంలో వాడు కించపరిచాడో ఆ క్షణం నుంచే వాడి తోటలోని ఫలపుష్పవృక్షాలతోపాటు, రాజుగారి వ్యాధిని కుదిర్చే అద్భుతశక్తులు గల పుష్పం కూడా తన శక్తిని కోల్పోయింది. ఒక అపాత్రుడికి వరం ఇచ్చి, అనుభవం ద్వారా ఆ సంగతి గ్రహించి, దేవతాస్త్రీ వరాన్ని ఉపసంహరించుకున్నదే తప్ప, అసూయా ద్వేషాలవలన మాత్రం కాదు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : మాచిరాజు కామేశ్వరరావు రచన]



# చందమామ అనుబంధం—25

## మహనీయులు కలలుగన్న భారతదేశం:

### ఆధారశ్రుతి!

భారతజాతిని దీర్ఘనిద్ర నుంచి తట్టి లేపి, కరుడుగట్టిన మూఢ విశ్వాసాలను పోగొట్టడమే తన జీవిత లక్ష్యంగా భావించి పాటుపడిన మహనీయుడు స్వామి వివేకానంద (1863-1902). దేశప్రజలలో నిద్రాణమై వున్న ఆధ్యాత్మిక శక్తిని రగుల్కొలిపి, ధర్మనిరతిని పెంపొందింపచేస్తేనే అభ్యుదయం సాధ్యం అని ఆయన భావించాడు. స్వామి వివేకానంద ఇలా అన్నాడు:

"ఒక్కొక్క వ్యక్తికిలాగానే ఒక్కొక్క దేశానికీ ప్రత్యేక లక్ష్యం వుంటుంది. ఆ ఆశయమే దాని జీవనాడి. జాతి జీవనవిధానాన్ని నిర్ణయించే ఇతర విషయాలు ఆ కేంద్రబిందువు చుట్టూ తిరుగుతూ వుంటాయి. ఈ ప్రధాన ఆశయం నుంచి ఏదేశమైనా దూరమయినట్టయితే, వినాశానికి దారి తీసి క్రమేణా పతనమైపోతుంది. ఇంగ్లాండు వంటి కొన్ని దేశాలకు రాజకీయశక్తి ప్రధాన లక్ష్యం. మరికొన్ని దేశాలకు కళాజీవితం ప్రధాన ఆశయం. అదే విధంగా భారత జాతీయ జీవన సంగీతానికి ఆధారశ్రుతి ధర్మం!"

స్వామి వివేకానంద 'ధర్మం' అని అన్నది మనం అనుసరించే పైపై ఆచార సంప్రదాయాలను కాదు. మనలోని సత్యాన్వేషణనూ, ధర్మనిరతినీ మాత్రమే ఆయన 'ధర్మం' అన్నాడు. ఆ మహనీయుడి ఆశయానికి మనమెంత చేరువగా ఉన్నామో ఆత్మపరిశీలన చేసుకోవడం ఎంతయినా అవసరం!

### మీకు తెలుసా?

1. ప్రాచీన భారతదేశంలో ప్రసిద్ధిగాంచిన ఒక రాజును గురించిన వివరాలను తన రచనలలో పొందుపరచిన విదేశీయాత్రికుడు ఎవరు?
2. ఆయన తెలియజేసిన రాజు ఎవరు?
3. ఆయన రాజధానీ నగరం ఏది?
4. ప్రపంచంలో మొట్టమొదటి విమానం ఎంత ఎత్తుకు ఎగిరింది? ఎంతసేపు ఎగిరింది?
5. ఈనాటి పక్షులలో పరిమాణంలో చాలా పెద్దది ఏది?

# విష్ణువు

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను త్రిమూర్తులని మన పురాణాలు పేర్కొంటాయి. సర్వచరాచర ప్రపంచానికి ఆధారభూతంగా ఉంటూ, మార్పుకు దోహదం చేసే విధంగా సృష్టి, స్థితి, లయాలను ఒక క్రమపద్ధతిలో నడిపే దివ్యశక్తి రూపాంతరాలే ఈ త్రిమూర్తులని పండితుల అభిప్రాయం.

భూమినీ, ఆకాశాన్నీ, దానికి అవల నున్న అంతరాళాన్నీ మహావిష్ణువు మూడడుగులతో కొలిచాడని పురాణాలు చెబుతాయి. సమాజంలో మార్పుతెచ్చి,



ధర్మ సంస్థాపన జరపాలనుకున్నప్పుడు విష్ణువు మానవ రూపంలో భూమిపై అవతరిస్తాడట. ఇంతవరకు ఆయన తొమ్మిది అవతారాలెత్తాడు. మునుముందు పదవదైన కల్క్యవతారం ఎత్తి—మనుషుల దుష్టస్వభావాన్ని, ఆటవిక మనస్తత్వాన్నీ రూపుమాపి—మంచితనం నిండిన నూతన మానవజాతి ఆవిర్భావానికి అంకురార్పణ చేస్తాడట!

తలపై అందమైన కిరీటంతో, పైన రెండు చేతులలో శంఖ చక్రాలనూ, కింది రెండు చేతులలో గదా పద్మాలనూ ధరించిన భంగిమలో విష్ణుమూర్తి విగ్రహాలూ, చిత్రాలూ కనిపిస్తాయి.

విష్ణువుకు కుడివైపున లక్ష్మీదేవి, ఎడమవైపున భూదేవి వుంటారు. పాలకడలిలో శేషతల్పం మీద శయనించిన భంగిమలోనూ, గరుడవాహనారూఢుడై వున్నట్టూ రకరకాల విష్ణురూపాలు ఉన్నాయి.

మహావిష్ణువుకు వేనవేల నామాలున్నాయి. వాటిలో—అనంత, వైకుంఠేశ్వర, వేంకటేశ్వర, కేశవ, అచ్యుత, మాధవ, పీతాంబర, జనార్దన, విశ్వంభర, దామోదర, చతుర్భుజ, ముకుంద, మురారి, నారాయణ, పద్మనాభ, హరి, యజ్ఞేశ్వర మొదలైనవి ముఖ్యమైనవి.

# చందమామ కబుర్లు

## చెవిటివాళ్ళ నగరం!

మన దేశంలో అన్ని నగరాలకన్నా కలకత్తానగరంలోనే శబ్దకాలుష్యం ఎక్కువ. వాహనాల హోరు, ఫేక్టరీల రణగొణధ్వనులూ ఇలాగే పెరుగుతూ పోయాయంటే—కొన్ని సంవత్సరాలలో వేలాదిమంది నగర ప్రజలు చెవిటివాళ్ళయిపోయే ప్రమాదం వుందని నిపుణులు హెచ్చరిస్తున్నారు. ఇప్పుడు కూడా చాలా మందికి వినికిడిశక్తి క్రమేణా తగ్గిపోతున్నది.

తగిన జాగ్రత్తలు తీసుకోకపోతే ఈనాడు కలకత్తా నగరానికి ఏర్పడిన స్థితి, మరే నగరానికైనా ఏర్పడడానికి ఎంతోకాలం పట్టదు.



## అత్యంత పురాతనమైన బావి!

ఇన్నాళ్ళు అతి ప్రాచీనమైనదని భావించబడిన బావి టర్కీలో ఉన్నది. అయితే, ఇటీవల ఇజ్రాయెల్‌లో కనుగొనబడిన బావి దానికన్నా పురాతనమైనదని భావిస్తున్నారు. 8 వేల సంవత్సరాలకు పూర్వంనాటి ఈ బావి రాతియుగం నాటిది. ఈ బావి ద్వారా, ఆనాటి మానవుడికి సైతం నీటివనరుల గురించి బాగా తెలిసివుందేదన్న విషయం వెలుగులోకి వచ్చింది.



# సాహిత్యావలోకనం

1. నిజజీవితంలో 'రాబిన్‌హుడ్' పాత్రకు దగ్గరగా, ఆ పాత్రలాగే జీవితం సాగించిన వ్యక్తి ఎవరు ?
2. ఆయనను గురించి నవల రాసిన సుప్రసిద్ధ రచయిత ఎవరు ? ఆ నవల పేరేమిటి ?
3. ఆ రచయిత రచించిన ఇతర సుప్రసిద్ధ నవలలు ఏవి ?
4. రవీంద్రనాథటాగూర్ 'గీతాంజలి'ని బెంగాలీ నుంచి ఇంగ్లీషుకు అనువదించిన వారెవరు ?
5. ఆ ఇంగ్లీషు అనువాదానికి పరిచయం రాసిన వారెవరు ?
6. మొదటి సంవత్సరంలో 'గీతాంజలి' పునర్ముద్రణ ఎన్నిసార్లు జరిగింది ?

## సమాధానాలు

మీకు తెలుసా ?

1. చైనా యాత్రికుడు ఫాహియాన్
2. విక్రమాదిత్యుడు
3. ఉజ్జయిని.
4. 1903 వ సం॥లో రైట్‌సోదరులు 8-12 అడుగుల ఎత్తులో 12 సెకండ్లపాటు ఎగిరారు.
5. ఉత్తర ఆఫ్రికాలోని దివ్యుకోడి.

సాహిత్యం

1. స్కాంట్‌లాండ్‌కు చెందిన రాబ్‌రాయ్.
2. సర్ వాల్టర్‌స్కాట్ (1771-1832). నవలపేరు 'రాబ్‌రాయ్'
3. "ఐవాన్‌హో", "ది టాలిస్‌మన్", "ఎ లిజెండ్ ఆఫ్ మాంట్రోస్" మొదలైనవి.
4. రవీంద్రనాథ టాగూరే చేశారు.
5. డబ్ల్యు. బి. ఈట్స్
6. 1913 వ సం॥ మార్చి-డిసెంబర్ మధ్యకాలంలో పదమూడు పునర్ముద్రణలు వెలువడ్డాయి.



# శ్రీ రామకృష్ణపరమహంస

## (6)

బెంగాల్‌లో వివిధ రంగాలకు చెందిన మహాపురుషులు నివసించిన కాలం అది. అటువంటి వారిలో బ్రహ్మసమాజ నాయకుడయిన కేశవచంద్రసేన్ ఒకరు. శ్రీ రామకృష్ణ, కేశవచంద్రసేన్ ఇంటికి వెళ్ళి ఆయనతో మాట్లాడాడు. ఆ మాటలు కేశవచంద్రసేన్ ఆలోచనాధోరణిని ఎంతగానో ప్రభావితం చేశాయి.

సుప్రసిద్ధ కృష్ణ భక్తుడయిన శ్రీ చైతన్య మహాప్రభు, కృష్ణ నామ సంకీర్తనం చేస్తూ, భక్తులనెలా నడిపించేవాడో కదా అని, శ్రీ రామకృష్ణ తరచూ అనుకునే వాడు. ఒకనాడు ఆయన కళ్ళముందు శ్రీ చైతన్య ప్రభువు విష్ణుభక్తులతో వెళ్ళే దృశ్యం కనిపించింది.





ఉత్తరోత్తరా వివేకానందుడుగా ప్రసిద్ధి గాంచిన నరేంద్రనాథ్ 1880వ సం॥ శ్రీ రామకృష్ణను సందర్శించాడు. ఆ యువకుణ్ణి చూడగానే శ్రీ రామకృష్ణ ఆనందానుభూతికిలోనయ్యాడు. ఆయన ప్రవర్తనను చూసి వివేకానందుడు మొదట ఆశ్చర్యం చెందినప్పటికీ, ఆ క్షణంనుంచే ఆయనపట్ల ఆకర్షితుడయ్యాడు.



రోజులు గడిచేకొద్దీ నరేంద్రుడు శ్రీ రామకృష్ణకు మరింత చేరువయ్యాడు. తండ్రి మరణించాక నరేంద్రుడి కుటుంబం ఆర్థికంగా దెబ్బతిన్నది. తమకు సాయం చేయమని కాళీమాతను ప్రార్థించమని నరేంద్రుడు గురువుతో చెప్పాడు. శ్రీ రామకృష్ణ నరేంద్రుడినే ఆ పని చేయమన్నాడు. నరేంద్రుడు మందిరంలో ప్రవేశించాడు గాని, కాళీమాత సమక్షంలో తనకు భక్తిజ్ఞానాలు ప్రసాదించమని ప్రార్థించాడు.

ప్రముఖ సంఘ సంస్కర్తా, విద్యావేత్తా అయిన ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ను కూడా శ్రీ రామకృష్ణ చూసి మాట్లాడాడు. ఒకప్పుడు ఒక శిష్యుడు, "సత్యాన్ని గ్రహించినవారు కూడా దానిని గురించి మాట్లాడతారా?" అని అడిగాడు. "తుమ్మెద మకరందాన్ని ఆస్వాదించడానికి ముందు ఝుంకారం చేస్తుంది. ఆస్వాదించిన తరవాత ఆనందంతో మధుర రాగాలాపన చేస్తుంది కదా!" అన్నాడు శ్రీ రామకృష్ణ.





దేవేంద్రనాథటాగూర్, విజయకృష్ణ గోస్వామి, స్వామి దయానంద మొదలైన ఆనాటి ప్రముఖులందరికీ శ్రీరామకృష్ణతో పరిచయం ఉండేది. ప్రముఖ నాటకకర్త గిరీష్ చంద్రఘోష్ శ్రీ రామకృష్ణ శిష్యుడయ్యాడు. శ్రీ రామకృష్ణ, గిరీష్ ప్రదర్శించిన నాటకాన్ని చూసి, నాటక కళాకారులను ఆశీర్వదించాడు.

శ్రీ రామకృష్ణపరమహంస నిరాడంబరత, బోధనలు ప్రజలను ఎంతగానో ఆకర్షించాయి. భక్తుల జీవితాలలో గొప్ప మార్పును తీసుకువచ్చాయి. ఆ మహాత్ముడి దర్శనం కోసం రోజూ అసంఖ్యాకంగా భక్తులు రాసాగారు.





1885 వ సం॥ గొంతులో నొప్పి ఏర్పడి శ్రీరామకృష్ణకు జబ్బు చేసింది. వైద్యులు ఆయనకు మాట్లాడవద్దని సలహా ఇచ్చారు. అయినా, భక్తులు ఏవైనా సందేహాలు అడిగినప్పుడు, శ్రీ రామకృష్ణ సమాధానం ఇవ్వసాగాడు. ఎవరైనా నిజమైన భక్తితో గీతాలాపాన చేసినప్పుడూ, గొప్పవారిని చూసినప్పుడూ ఆయన అతీత ధ్యానస్థితిలోకి వెళ్ళిపోయేవాడు.

వ్యాధి ఎక్కువకావడంతో ఆయనను కలకత్తా సమీపంలోని కోసిపూర్ గార్డెన్స్‌కు తరలించారు. మహేంద్రలాల్ సర్కార్ వంటి గొప్ప వైద్యులు ఎంతో ప్రయత్నించినప్పటికీ వ్యాధి నయంకాలేదు. ఒకనాడు శ్రీ రామకృష్ణపరమహంస నరేంద్రనాథ్‌ను దగ్గరికి పిలిచి కొంతసేపు అప్యాయంగా చూశాడు. తన అధ్యాత్మికశక్తిని శిష్యునిలోకి ప్రవేశపెట్టాడు.





1886 వ సం॥ ఆగస్టు 16 వ తేదీ శ్రీ రామకృష్ణ పరమహంస పరమపదించాడు. కోసిపూర్ ఘట్‌లో ఆ మహాపురుషుడి భౌతిక కాయానికి దహన సంస్కారాలు జరిగాయి!

ఆ తరవాత కూడా శ్రీ రామకృష్ణ పరమహంస సతీమణి శారదాదేవి శిష్యులకు తగిన సలహాలు ఇస్తూ, వారిని కన్నతల్లిలా ఎంతో ఆదరంగా చూడసాగింది.





గురువు సంకల్పానుసారం ఆయన ప్రధాన శిష్యుడయిన నరేంద్రుడు ఆ తరవాత స్వామి వివేకానందుడుగా, సర్వమత సమన్వయం, విశ్వమానవ సౌభ్రాతృత్వం ప్రబోధించే శ్రీ రామకృష్ణ పరమహంస బోధనలను ప్రపంచమంతటా వ్యాపింపజేశాడు. ఆ మహాపురుషుడి బోధనలు ఈ నాటికీ ఎంతో మందికి ఉత్తేజాన్నీ, మనశ్శాంతినీ కలిగిస్తున్నాయి! —(అయిపోయింది)



# ధర్మయ్య పరీక్ష

రామాపురం గ్రామంలోని ధర్మయ్య గొప్ప స్థితిమంతుడే కాక, పేరుకు తగినట్టు మంచి ధర్మబుద్ధికలవాడు. ఆయనకు పెళ్ళీడుకొచ్చిన విశ్వం అని ఒకే ఒక కొడుకున్నాడు. విశ్వం రూపవంతుడే కాక, మంచి గుణవంతుడు కూడా. అతడికి తగిన రూపవతి, గుణవతి అయిన కన్య కోసం ధర్మయ్య వెతకసాగాడు.

ధర్మయ్యకు అదే గ్రామంలో వెంకప్ప అని ఒక స్నేహితుడున్నాడు. వెంకప్ప జరీచీరలు ఇంట్లో మగ్గాలమీద నేయించి, చుట్టుపక్కల గ్రామాలకు తీసుకుపోయి అమ్ముతూండేవాడు. వాటిని కాస్త కలిగిన గృహస్థులందరూ కొనేవారు. ఆ కారణంగా, వెంకప్పకు చాలా గ్రామాల్లోని ఆస్తిపరుల గురించి బాగా తెలుసు.

ఒకసారి అతడు ధర్మయ్యతో, "నువ్వు విశ్వానికి పిల్లను వెతుకుతున్నావని తెలిసింది. పేరవరంలోని రాజయ్యగారికి కమల అని అందమైన అమ్మాయి వున్నది. వీరవరంలోని రామయ్యగారికి సరళ అనే చక్కని కూతురున్నది. వీళ్ళిద్దర్నీ నువ్వూ, విశ్వం ఒకసారి వెళ్ళి చూసి, ఇద్దర్లో నచ్చినవారినొకరిని ఎన్నుకుంటే సరిపోతుంది. రాజయ్య, రామయ్య ఇద్దరూ కూడా సాంప్రదాయాల్లో, ఆస్తిపాస్తుల్లో నీకు సరితూగగలవారు," అన్నాడు.

ధర్మయ్య, వెంకప్ప చెప్పిన విధంగా విశ్వాన్ని వెంటబెట్టుకుని, రెండు గ్రామాలకూ వెళ్ళి కమల, సరళలను చూసి వచ్చాడు. ఇద్దరూ ఒకరినిమించి ఒకరు అందగత్తెలుగా తోచారు. విశ్వం ఆ ఇద్దర్లో ఎవర్నో ఒకర్ని వధువుగా ఎన్నుకునే భారం తండ్రి మీద వుంచాడు. ధర్మయ్యకు ఆ ఇద్దర్లో ఎవర్ని కోడలిగా తెచ్చుకోవాలన్నది పెద్ద సమస్యగా పరిణమించింది.

గవ్వలనిర్మలాదేవి



అప్పుడు ధర్మయ్య, వెంకప్పకు చేయ వలసిందేమిటో వివరించాడు.

వెంకప్ప, ధర్మయ్య చెప్పిన విధంగా కొన్ని కొత్త నమూనా జరీచీరలు తీసుకుని, మొదట పేరవరం వెళ్ళాడు. కమల, వెంకప్పను చూస్తూనే, "కొత్తరకం చీరలు ఏమైనా తెచ్చావా ?" అని అడిగింది.

వెంకప్ప చీరలమూట విప్పుతూ, "కొత్త రకం చీరలు ఏవైనా నేయగానే, మొదట చూపేది మీకేగదమ్మా!" అని, చీరలను కమల ముందు వుంచాడు.

కమల కొత్త జరీచీరలను చూసి చాలా ముచ్చటపడింది. వెంకప్ప వాటిలోంచి ఒక చీర తీసి కమలకిస్తూ, "ఇది తీసుకోండి అమ్మాయిగారూ, మీకు బాగా నప్పుతుంది. జరీనేత కూడా దట్టంగా వున్నది. కట్టుకు చూశాక, నా ఎన్నికను మీరు తప్పక మెచ్చుకుంటారు," అన్నాడు.

కమల చీర తీసుకుని, "మరి ఈసారి రవికముక్కలు తెచ్చినట్టులేదే! తెచ్చి వుంటే, చీరకు తగిన రవిక కూడా తీసుకునేదాన్ని కదా," అన్నది.

దానికి వెంకప్ప తల గోక్కుని, "అవునుమరి! కాని, రవికకు పనికొచ్చే గుడ్డ మగ్గం మీద వున్నది. వారం పది రోజుల్లో తప్పక తెచ్చిస్తాను," అని చీర ఖరీదు తీసుకుని, వీరవరం వెళ్ళాడు.

ఆయన వెంకప్పతో, "ఈ కోడల్ని తెచ్చుకోవడం అనేది, పెద్ద సమస్యగా తయారైంది వెంకప్పా! కమల, సరళ ఇద్దరూ మంచి అందగత్తెలే, కాని, అందం శాశ్వతం కాదుగదా. అందుకని, వాళ్ళిద్దరి గుణగణాలకు చిన్న పరీక్ష ఒకటిపెట్టి, అందులో నెగ్గిన పిల్లను నా కోడలుగా తెచ్చుకోవాలనుకుంటున్నాను. ఇందుకు నీ సాయం కావాలి," అన్నాడు.

అందుకు వెంకప్ప నవ్వి, "నా సాయమా, దానికేం! ధర్మసూక్ష్మాలెన్నో తెలిసినవాడివని, నీకు మంచి పేరున్నది. నీలాంటి స్నేహితుడికిసాయపడడంకంటే, నాకా్కవలసినదేముంది," అన్నాడు.

అక్కడ రామయ్య కూతురు సరళకు కూడా, వెంకప్ప తెచ్చిన జరీచీరలు బాగా నచ్చినై. అతడు, ఆమెకు ఒక చీర ఇచ్చి, "అమ్మాయిగారూ, దీనికి తగిన రవిక గుడ్డ వారం రోజుల్లో తెస్తాను. ఈలోగా తొందరపడి ఎవరిదగ్గిరా కొనకండి. ఈ చీరకు నప్పే రవికగుడ్డ మగ్గం మీద వున్నది," అని చెప్పాడు.

సరళ చీర డబ్బు ఇచ్చింది. వెంకప్ప స్వగ్రామం చేరాడు. రెండు వారాలు ఆగి, ధర్మయ్య చెప్పిన మీదట కమల, సరళల చీరలకు తగిన రవికగుడ్డలు తీసుకుని బయలుదేరాడు.




అతడుకమలవద్దకువెళ్ళి, "అమ్మాయి గారూ; మీరు కొన్న చీరకు తగిన రవిక గుడ్డ తెచ్చాను, చూడండి!" అన్నాడు.

అయితే కమల, అతడితో, "అక్కర్లే దులే, వెంకప్పా! రవికగుడ్డ మరొకరి దగ్గిర కొన్నాను," అన్నది.

వెంకప్ప సరేనని బయలుదేరి సరళ ఇంటికి వెళ్ళాడు. సరళ అతణ్ణి అంత దూరాన చూస్తూనే, "రవికగుడ్డ తెచ్చి నట్టున్నావు, అవునా?" అని అడిగింది.

"అవును, తెచ్చాను అమ్మాయిగారూ. కాస్త అలస్యం అయింది. మీరు మరొక చోట కొనుక్కోలేదు గదా?" అని అడిగాడు వెంకప్ప.

సరళ నవ్వుతూ, "ఇంత మతిమరుపు మనిషి వేమయ్యా, వెంకప్పా! చీరలోనే రవికగుడ్డ కూడా మడతవేసి వున్నది. నువ్వు వెళ్ళాక చీరమడతలన్నీ విప్పు తూంటే, రవికగుడ్డ కిందపడింది. ఇదుగో, చూడు!" అంటూ గదిలోకి పోయి రవిక గుడ్డ తెచ్చి చూపించి, "ఆ రోజున నీకు చీరఖరీదే ఇచ్చాను. ఈ రవిక ముక్క ఖరీదేమిటో చెప్పు, ఇస్తాను," అన్నది.

వెంకప్ప తల గోక్కుంటూ, "మరిచే పోయానమ్మాయిగారూ! పెద్దవాణ్ణయి పోతున్నా గదా," అంటూ రవికగుడ్డ ఖరీదు తీసుకుని తిరుగుప్రయాణ మయ్యాడు.

వెంకప్ప గ్రామానికి తిరిగివస్తూనే, ధర్మయ్య దగ్గిరకు పోయి జరిగినదంతా చెప్పాడు.

అంతా విని ధర్మయ్య తృప్తిగా తల ఊంచి, "నాకాబోయే కోడలెవరో తేలిపోయింది, వెంకప్పా! మంచి ముహూర్తం చూసుకుని, తాంబూలాలు మార్చుకోవడానికి బయలుదేరాలి," అన్నాడు.

వెంకప్ప, "ఇంతకూ నువ్వు ఏ అమ్మాయిని కోడలుగా చేసుకోబోతున్నావో, నాకు అంతుబట్టడం లేదు," అన్నాడు.

అప్పుడు ధర్మయ్య, "నువ్వు మొదట నేను ఇవ్వమన్న చీరలను కమలకొకటీ, సరళకొకటీ ఇచ్చావు గదా?" అన్నాడు.

"అవును. నువ్వు ఇవ్వమన్న చీరలనే వాళ్ళకు, వాటిని గురించి కాస్త పొగిడి ఇచ్చి వచ్చాను," అన్నాడు వెంకప్ప.

"ఆ రెండు చీరల్లోనూ. మనం వాటికి నప్పే రవికముక్కలను కూడా వుంచి మడతవేసిన సంగతి, నీకు గుర్తున్నది కదా?" అని అడిగాడు ధర్మయ్య.

వెంకప్ప ఒక్క క్షణం ఆశ్చర్యపోయి, "ఆఁ, ఇప్పుడు తెలిసింది. నీ కాబోయే కోడలు సరళ అన్న మాట!" అన్నాడు.

"బాగా గ్రహించావు, వెంకప్పా! సరళకున్న నిజాయితీ, కమలవద్ద కొరవడింది. కమల చీర మడతల్లో వున్న రవికముక్కను దాచుకున్నది. అందువల్లనే నువ్వు తిరిగి అమ్మడానికి వెళితే, తాను మరొకరి దగ్గిర కొన్నానని అబద్ధం చెప్పింది. ఇటువంటి చిన్న చిన్న విషయాల్లోనే మనుషుల అసలు బుద్ధులు వెల్లడవుతుంటాయి. సరే, కమలకిచ్చిన రవికగుడ్డ ఖరీదెంతో చెప్పు ఇస్తాను," అన్నాడు ధర్మయ్య.

వెంకప్ప సంతోషంగా, "భలేవాడివి ధర్మయ్యా! దాని ఖరీదు నాకిస్తావా? నీ మనసుకు నచ్చిన కోడలు దొరకడానికి, ఉడతాభక్తిగా నేనేదో చిన్న సాయం చేశానన్న తృప్తి, నాకు చాలు," అన్నాడు.

ఆ తర్వాత ధర్మయ్య కొడుకు విశ్వానికీ, సరళకూ వైభవంగా వివాహం జరిగింది.





# వీరహనుమాన్

వాలి ప్రాణాలు ఇంకా పోలేదు. అతను కళ్ళు తెరిచి అటూ ఇటూ చూశాడు. తన కొడుకు దగ్గిర నిలబడి ఉన్న సుగ్రీవుడు కనిపించాడు. వాలి సుగ్రీవుడితో ఇలా అన్నాడు:

''నిన్ను రాజ్యం నుంచి వెళ్ళగొట్టి, నీ భార్యను హరించానని నన్ను తప్పు పట్టకు. మనమిద్దరమూ రాజ్యాన్ని పంచుకోవటమూ, సోదర స్నేహంతో ఉండటమూ రాసిపెట్టి లేక నా బుద్ధి అలా పోయింది. నేను చచ్చిపోతున్నాను గనక, నువ్వు వానర రాజువుకా. నా ఈ చివరి కోరిక ఎంత కష్టమైనా తీర్చు. నాకు ప్రాణం కన్న ఎక్కువైన వాడు అంగదుడు; వాణ్ణి నీ కొడుకులాగే చూసుకో. వాడికి ఏ. లోటూ రానీకు. వాడికి ఇక నువ్వు తప్ప ఎవరూ లేరు. వాడు నీ అంత పరాక్రమం గలవాడు; అన్ని విషయాలలోనూ నీకు తోడుగా ఉండగలడు. సుషేణుడి కూతురూ, నా భార్యా అయిన తార చాలా సూక్ష్మబుద్ధి గలది. రానున్న కష్టాలను ముందుగా తెలుసుకోగలదు. అందుచేత ఆమె చెప్పినట్టు చెయ్యి. లేకపోతే నీకు ఆపద కలుగుతుంది. నాకు దేవేంద్రుడిచ్చిన కాంచనమాల ఇప్పుడే నువ్వు తీసుకో. నేను చచ్చిపోతే దీని కాంతి పోతుంది.''

వాలి చెప్పినదానికి సుగ్రీవుడు వినయంగా తల ఆడించి, కాంచనమాల తీసుకున్నాడు.

## 6. సుగ్రీవ పట్టాభిషేకం



చంపాడు. వాలి ఉండగా వానరులకు ఎవరి భయమూ లేకపోయింది.

తార తన భర్త కోసం తలుచుకుని, తలుచుకుని ఏడిచింది. నీలుడు వాలి రొమ్ము నుంచి బాణం లాగేశాడు. తార చెప్పిన మీదట అంగదుడు వాలి కాళ్ళు పట్టుకుని నమస్కారం చేశాడు. తార దుఃఖం చూస్తూ సుగ్రీవుడు, తానే వాలిని చంపించినందుకు మహా బాధ పడ్డాడు. అతను కంట నీరు పెట్టుకుంటూ రాముడి దగ్గిరికి వెళ్ళాడు.

అలా వెళ్ళి సుగ్రీవుడు రాముడితో, "రామా, నువ్వు నీ మాట నిలబెట్టుకుని వాలిని చంపావు. నాకు రాజ్యం ఇచ్చావు. కాని నాకు జీవితం మీద కోరిక పోయింది. తారా, వానరులూ ఇలా ఏడుస్తూండగా నాకీ రాజ్యం ఎందుకు? మొదట వాలి నన్ను పెట్టిన బాధల మూలంగా వాలి చావు కోరాను. కాని, తీరా వాలి చచ్చిపోయాక పశ్చాత్తాపం నన్ను దహిస్తున్నది. నా జీవితమంతా ఋశ్యమూకం మీదనే వెళ్ళబుచ్చటం మంచిదని తోస్తున్నది. ఇప్పుడు నాకు స్వర్గం కూడా వద్దు. వాలి నన్ను ప్రాణాలతో వదిలాడు. నేను వాలి ప్రాణాలు తీయించాను. నాకంటె పాపి ఉండడు. ఇప్పుడు నేను యువరాజుగా ఉండటానికి కూడా తగను.

తరవాత వాలి అంగదుణ్ణి దగ్గిరికి పిలిచి, కొన్ని హితాలు చెప్పాడు: అతను తన పట్ల ప్రవర్తించినట్టే సుగ్రీవుడి పట్లా ప్రవర్తించాలి; సుగ్రీవుడి శత్రువులతో ఎన్నడూ చేరరాదు; సుగ్రీవుడు చెప్పిన పనులు శ్రద్ధగా చెయ్యాలి; ఎవరితోగాని అమిత స్నేహం చెయ్యటం గాని, అసలే స్నేహం చెయ్యకపోవటం గాని తప్పు. ఇలా చెప్పి వాలి ప్రాణాలు వదిలాడు. వానరులందరూ గొల్లున ఏడ్చారు. వాళ్ళు వాలి చేసిన మహా కార్యాలు తలుచుకున్నారు.

ఈ వాలి గోలభుడనే గంధర్వుడితో పదిహేను సంవత్సరాలు పోరాడి

రాజును ఎలా కాగలను? నేను కూడా వాలితోపాటు దహనమవుతాను. వానరులు నీ పని చూడగలరు; సీతాదేవిని వెతుకుతారు," అన్నాడు.

తార రాముణ్ణి చూసి దుఃఖిస్తూ ఇలా అన్నది:

"వాలిని చంపిన బాణంతోనే నన్ను కూడా చంపి, వాలి దగ్గిరికి పంపు. నేను వెంట లేకపోతే వాలికి సుఖం లేదు. సీతా వియోగంతో నువ్వు ఎలా బాధపడుతున్నావో, స్వర్గంలో వాలి నా కోసం అలా బాధపడతాడు. నన్ను చంపితే నీకు వాలిని చంపిన దోషం పోతుంది."

రాముడు ఆమెను ఓదార్చుతూ, "వీర పత్నివైన నువ్వు ఇలా దుఃఖించరాదు. వాలి ఉన్నప్పుడు సుఖపడినట్టే నువ్వు మళ్ళీ సుఖపడతావు. నీ కొడుకు అంగదుడు యువరాజు అవుతాడు," అన్నాడు.

అతను వానరులతో, "ఎంత ఏడిచినా చచ్చిపోయిన వాడికి అందువల్ల మేలు జరగదు. కాలయాపన ఎందుకు, వాలికి ఊర్ధ్వలోకాలు కలిగే కార్యక్రమం చెయ్యండి," అన్నాడు.

అప్పుడు లక్ష్మణుడు దుఃఖంలో మునిగి ఉన్న సుగ్రీవుడితో, "సుగ్రీవా, వాలికి దహన సంస్కారం జరగాలి. వానరుల చేత చందనం మొదలైనవి, ఎండు కట్టెలు తెప్పించు. అంగదుణ్ణి ఓదార్చి, తండ్రి తలకింద కొరివి పెట్టటానికి అతన్ని సిద్ధం చెయ్యి. ఇక నుంచి





కిష్కింధను పాలించవలసిన నువ్వు ఏడుస్తూ కూచుంటే జరగదు. అంగదుడి చేత పూలూ, బట్టలూ, నెయ్యీ, నూనే, గంధ ద్రవ్యాలూ వెంటనే తెప్పించు. పల్లకి ఒకటి తీసుకురావాలి. వాలిని మోసే వానరులు సిద్ధంగా ఉండాలి," అన్నాడు.

లక్ష్మణుడు ఇలా చెప్పగానే తారుడు పల్లకిని పట్టుకురావటానికి కిష్కింధకు వెళ్ళి, త్వరలోనే తిరిగి వచ్చాడు. సుగ్రీవుడూ, అంగదుడూ కలిసి వాలి శరీరాన్ని పల్లకీలో పడుకోబెట్టారు. సుగ్రీవుడు వాలి శరీరం మీద పూలు కప్పి, పల్లకీ తీసుకుపోయే దారి వెంట పూలు చల్లమని వానరులను ఆజ్ఞాపించాడు. శవం వెంట అంగదుడితోబాటు, వాలి బంధువులైన తారుడు మొదలైన వాళ్ళూ, స్త్రీలూ నడిచారు. ఒక వాగు సమీపాన ఇసుకలో చితి ఏర్పరిచారు. తరవాత వాలిని దహనం చేసి, జల తర్పణాలు విడిచారు. రాముడు దగ్గిర ఉండి వానరుల చేత కర్మకాండ అంతా యథావిధిగా చేయించాడు.

సుగ్రీవుడు స్నానం చేసి, తడి బట్టలతో రామలక్ష్మణుల వద్దకు వచ్చాడు. వానరులంతా అతనితోబాటే అక్కడ నిలబడ్డారు. అప్పుడు హనుమంతుడు రాముడితో, "రామా, నీ దయవల్ల సుగ్రీవుడికి రాజ్యం వచ్చింది. నీ సెలవైతే అతను ఇప్పుడు కిష్కింధ ప్రవేశించి, ఎన్నో ముఖ్యమైన పనులు చెయ్యాలి. అతను శాస్త్రోక్తంగా పట్టాభిషేకం చేయించుకుని, నిన్ను తగిన విధంగా సన్మానిస్తాడు. అందుచేత నువ్వు కిష్కింధకు వచ్చి, నీ చేతి మీదుగానే పట్టాభిషేకం జరిపించి, వానరులకు ఆనందం కలిగించు," అన్నాడు.

దానికి రాముడు, "హనుమంతుడా, తండ్రి ఆజ్ఞ ప్రకారం పధ్నాలుగేళ్ళు వనవాసం చెయ్యవలసిన నేను గ్రామాలలోకి గాని, పట్టణాలలోకి గాని ప్రవేశించరాదు.



మీరే సుగ్రీవుణ్ణి తీసుకుపోయి, అతనికి వైభవంగా పట్టాభిషేకం చెయ్యండి. అలాగే ఈ అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించండి. ఇప్పుడే శ్రావణమాసం ఆరంభమయింది. ఇక నాలుగు నెలలపాటు వర్షాకాలం. యుద్ధానికి తగిన కాలం కాదు. మీరంతా కిష్కింధకు వెళ్ళండి. నేనూ, లక్ష్మణుడూ ఈ పర్వతం మీద ఉంటాం. ఇక్కడ ఉన్న గుహ విశాలంగా, ఉండటానికి చాలా బాగున్నది. పక్కనే నీరూ, పద్మాలూ ఉన్నాయి. తిరిగి కార్తికమాసం వచ్చినప్పుడు రావణుణ్ణి యుద్ధంలో చంపే ప్రయత్నం చేద్దాం," అన్నాడు.

ఈ విధంగా రాముడి ఆజ్ఞ పొంది సుగ్రీవుడు కిష్కింధ ప్రవేశించాడు. వానరులంతా అతన్ని అనుసరించారు. అతను తనను చూడవచ్చిన వానరులనందరినీ ఆప్యాయంగా పరామర్శించి, తారను ఊరడించటానికి వాలి అంతఃపురానికి వెళ్లాడు.

సుగ్రీవుడు వాలి అంతఃపురం నుంచి తిరిగి రాగానే వానరులు అతని పట్టాభిషేకం కోసం బంగారు అలంకరణలు గల తెల్లగొడుగూ, రెండు వింజామరలూ, అన్ని రకాల మణులూ, సమస్త విత్తనాలూ, ఓషధులూ, పూలూ, చందనమూ, అక్షింతలూ, కుంకుమపువ్వూ, తేనే, నెయ్యీ, పెరుగూ మొదలయినవన్నీ సిద్ధం చేశారు. అడవిపంది చర్మంతో కుట్టిన పాదరక్షలు సుగ్రీవుడి కోసం సిద్ధం చేశారు.

తరవాత బ్రాహ్మణులు అగ్నిహోత్రం చేసి, పూజించి, సుగ్రీవుడికి వేదోక్తంగా పట్టాభిషేకం చేశారు. గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, మైందుడూ, ద్వివిదుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ, నళుడూ బంగారు కలశాలతోనూ, ఎద్దుకొమ్ములతోనూ నదీ జలం తెచ్చి సుగ్రీవుణ్ణి అభిషేకించారు.



రాముడు చెప్పిన ప్రకారం సుగ్రీవుడు అంగదుణ్ణి యువరాజుగా అభిషేకించాడు. అలా చేసినందుకు వానరులు సుగ్రీవుణ్ణి మెచ్చుకున్నారు. వానరులందరూ పండగ చేసుకున్నారు.

సుగ్రీవుడు రాముడి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పి, తిరిగి వచ్చి, తన భార్య అయిన రుమతో సుఖంగా జీవించసాగాడు.

రామలక్ష్మణులు వానాకాలం గడపటానికి నిర్ణయించుకున్న గుహ ప్రస్రవణ పర్వతం మీద ఉన్నది. అది చాలా అందమైన పర్వతం. గుహకు సమీపంలోనే తామర కొలను ఉన్నది. గుహ ద్వారం నైరుతి దిక్కుగా ఉండటంచేత వానజల్లు లోపలికి రాదు. తూర్పు నుంచి ఈదురు గాలి కూడా లోపలికి రాదు. గుహ ముందర చక్కని సమప్రదేశం ఉన్నది. అక్కడికి సమీపంలోనే చక్కని నది కూడా ప్రవహిస్తున్నది. కిష్కింధానగరం అక్కడికి ఎంతో దూరం లేదు. కిష్కింధలో జరిగే కోలాహలమూ, వాద్యాల ధ్వనులూ గుహకు స్పష్టంగా వినిపించాయి.

అలాటి అందమైన ప్రదేశంలో ఉంటూ రాముడు ఒక వంక సీత కోసం బాధ పడుతూ, రావణుణ్ణి చంపటానికి సుగ్రీవుడు సహాయ పడతాడని ఆశపడుతూ, శరత్కాలం కోసం ఎదురు చూడసాగాడు. అతనికి ఆ వానాకాలం చాలా కష్టం మీద గడిచింది.

చివరకు వానలు వెనకపడ్డాయి. కాని సుగ్రీవుడు రాముడి పని సంగతి పూర్తిగా మరిచిపోయాడని హనుమంతుడికి తోచింది. సుగ్రీవుడు రాజ్యభారమంతా మంత్రులకు వదిలేసి, పూర్తిగా తన కాలమంతా అంతఃపుర విలాసాలలో ఇన్నాళ్ళూ గడిపాడు.

ఇది గమనించిన హనుమంతుడు సుగ్రీవుడి వద్దకు వెళ్ళి, "నీకు రాజ్యమూ, వైభోగమూ వచ్చాయి. స్నేహితుల పట్ల

బాధ్యతతో కూడా నిర్వర్తించు. సొంత పనులు పాడుచేసుకుని అయినా మిత్రుల పనులు చూసేవాడు నశించడు. మనం ఇప్పుడు రాముడి కోసం సీతను వెదక వలసి ఉన్నది. ఈ పని ఇప్పటికే ప్రారంభం కావలిసింది. రాముడు మంచి వాడు గనక ఓపిక పట్టాడు. సీతను వెదకటానికి వానరులను పంపించు,'' అన్నాడు.

సుగ్రీవుడికి ఈ మాటతో తొందర కలిగింది. అతను నీలుణ్ణి పిలిచి, అన్ని దిక్కులా ఉన్న వానరసేనలను పిలిపించమని ఆజ్ఞాపించాడు; పదిహేను రోజుల లోపల కిష్కింధకు వచ్చి చేరని వానరులందరికీ మరణదండన ప్రకటించాడు.

ఈ లోపల రాముడు, వర్షాకాలం పోయినా సుగ్రీవుడు రాక పోయేసరికి, చాలా బాధపడ్డాడు. అతను లక్ష్మణుడితో, ''సుగ్రీవుడు శరత్కాలం రాగానే సీతను వెతికిస్తానని మాట ఇచ్చి, తన పని తీరిందిగదా అని ఉపేక్షిస్తున్నాడు. అతనికి నా బాణం దెబ్బతినాలని కోరికగా ఉన్నట్టున్నది. నువ్వు వెళ్ళి, నేను కోపంగా ఉన్నానని అతనితో చెప్పు. వాలిని పంపిన మార్గాన సుగ్రీవుణ్ణి కూడా పంపగలనని చెప్పు. ఇదంతా అతనికి ఎలా చెప్పాలో అలా చెప్పు,'' అన్నాడు.

లక్ష్మణుడికి కూడా సుగ్రీవుడి పైన చాలా కోపం వచ్చింది.

''ఈ సుగ్రీవుడు తనకు రాజ్యం ఎలా వచ్చినదీ మరిచాడు. అతని రాజ్యం నిలవదు. నే నిప్పుడే వెళ్ళి, ఆ సుగ్రీవుణ్ణి చంపి, అంగదుడి సహాయంతో సీతాదేవిని వెదికిస్తాను,'' అంటూ లక్ష్మణుడు ఆవేశంతో బయలుదేరేసరికి, రాముడు అతన్ని ఆపి, ''లక్ష్మణా, తొందరపడి అంత పని చెయ్యకు. మనకూ అతనికీ మధ్య ఉన్న స్నేహాన్ని మరవకు, సుగ్రీవుడితో మంచిగానే మాట్లాడు. అతను జాప్యం చేశాడే తప్ప, మనకు అపచారం ఏమీ చెయ్యలేదు,'' అన్నాడు.





# కామరాజు కోపం

కామరాజు అనే అతడికి కోపం ఎక్కువ. అతడికి ఈ మధ్యనే పెళ్ళయింది. భార్య సుశాంతి కాపరానికి వచ్చిన మొదటి రోజున, అత్తవారింట్లోకి ముందుగా కుడికాలు పెట్టి నడవమని అందరూ హెచ్చరిస్తున్నా, పరధ్యానంగా వుండి ఎడమకాలు పెట్టింది.

కామరాజు అది చూసి కోపంతో భార్య చెయ్యి పుచ్చుకుని విసురుగా వెనక్కు లాగి, "అంతమంది చెబుతున్నా వినవేం? ముందు కుడికాలు పెట్టు!" అన్నాడు.

ఆ క్షణంలోనే సుశాంతికి తన భర్త అమిత కోపిష్ఠి అని తెలిసిపోయింది. తర్వాత ఇంట్లోని పళ్ళాలూ, చెంబులూ, లోటాలూ అక్కడక్కడా సొట్టలు పడి వుండడం చూసి, అత్తగారు చెప్పకుండానే, అదంతా తన భర్త ప్రతాపమని ఆమె గ్రహించింది.

ఇంట్లో తెల్లగా సున్నం వేసిన గోడలకు, అక్కడక్కడా పచ్చని మరకలూ, ఏవో కూరల మరకలూ పడివున్నవి. ఒకనాడు వాటివంక పరిశీలనగా చూస్తున్న సుశాంతితో, అత్తగారు, "అవన్నీ కూరలూ అవీ రుచిగా లేనప్పుడు, నీ భర్త పళ్ళెం విసిరి వేసిన తాలూకు గుర్తులు!" అన్నది.

ఆ మాట విని ఆరేళ్ళ ఆడపడుచు పకపక నవ్వింది.

సుశాంతికి మాత్రం నవ్వు రాలేదు. తన భర్తకు అంత కోపం ఎందుకు వస్తుందో, ఆమెకు అర్థం కాలేదు. ఈ సంగతి ఒంటరిగా వున్నప్పుడు సుశాంతి, భర్తను అడిగింది. కామరాజు చిన్నగా నవ్వి ఊరుకున్నాడు తప్ప జవాబు చెప్పలేదు.

మంచి తెలివితేటలు గల సుశాంతి, ఏదైనా ఉపాయంతో భర్తలోని కోపాన్ని

దాసరి వెంకటరమణ

పోగొట్టాలని ఆలోచించింది. అందుకు కొంతకాలంపాటు, తను ఎంతో అమాయకురాలిననే భ్రమ, భర్తకు కలగడం అవసరం అనిపించిందామెకు.

కామరాజుకు కోపం వచ్చినప్పుడు చాలా పరుషంగా మాట్లాడతాడు. ఆ గుణాన్ని ఆసరా చేసుకుని, అతడి కోపాన్ని ఎలాగైనా పోగొట్టాలని సుశాంతి నిర్ణయించుకున్నది.

ఒక రోజు వీధిలోంచి ఇంట్లోకి వచ్చిన కామరాజు చాలా కోపంగా వున్నాడు. అతడు ఆ కోపాన్ని భార్య మీద చూపిస్తూ, ''పళ్ళెంలో నాలుగు మెతుకులు వేసి తీసుకురా. త్వరగా తిని తగలడాలి!'' అన్నాడు.

సుశాంతి అలాగే తీసుకు వచ్చి, పళ్ళెం అతడిముందు పెట్టింది. కామరాజు ఆశ్చర్యపోతూ మరింత కోపంగా భార్యకేసి చూశాడు. సుశాంతి అదేం గమనించకుండా, మరేదో పనిలో వున్నట్టు నటిస్తూ, ''అయినా, ఇదేం విడ్డూరమండీ! అంతా అదేదో కథల్లో విన్నట్టుగా వున్నది. నాలుగు మెతుకుల్తో మీకు ఆకలెలా తీరుతుంది?'' అన్నది.

తన భార్య కావాలనే అలా చేసిందని, అంతవరకూ మండిపడుతున్న కామరాజుకు, భార్య మాటల వెనక వున్న అమాయకత్వాన్ని గమనించేసరికి, కోపం కాస్తా ఎగిరిపోయింది. పెళ్ళయిన కొత్తలో తన భార్య అమాయకురాలే అనుకున్నాడు



గాని, మరీ ఇంత అమాయకురాలనుకో లేదు, కామరాజు.

ఈ విధంగా రెండు మూడు సార్లు ఇలాంటి తరహా సంఘటనలే జరిగాయి. ఒకసారి బాగా కోపం మీద వున్న కామరాజు, వంటగదిలో వున్న భార్యను కేక వేసి, "అ చేతిసంచి ఇలా తెచ్చి, నా మొహానకొట్టు. బజారుకు పోయి కూరగాయలు తెస్తాను," అన్నాడు.

సుశాంతి సంచీ తెచ్చి, కామరాజు అన్నట్టుగానే చేసింది.

కామరాజు కోపంగా ఇదేమిటని అడిగితే, ఆమె అమాయకంగా, "నాకేం తెలుసునండీ! బజారుకు వెళ్ళేముందు సంచీని భార్య అలా ముఖానకొట్టడం, మీ ఇంటి ఆచారమేమో—అలా చేస్తే శుభం జరుగుతుంది కాబోలు అనుకున్నాను," అన్నది.

కామరాజుకు ఏమని చెప్పాలో పాలు పోయిందికాదు.

ఒకసారి ఇంట్లోవాళ్ళందరూ పొరుగూళ్ళో పెళ్ళికి వెళ్ళారు. ఇంట్లో కామరాజూ, సుశాంతీ మాత్రమే వున్నారు. వసారాలో వున్న కుడితినీళ్ళకుండ నిండిపోవడంతో, దానిని దూరంగా చెట్టుకింద వున్న కుడితిగాబులో పోద్దామని తెచ్చింది, సుశాంతి. అయితే దానిలో రాత్రి పోసిన నీళ్ళు అవు తాగకపోవడంతో, నిండుగా వున్నది. సుశాంతికి చూస్తూ, చూస్తూ కుడితినీళ్ళు పారబోయ బుద్ధికాలేదు.



కామరాజు పక్కనే వున్న వేపచెట్టు కింద కూర్చుని యోగాసనాలు వేస్తున్నాడు. సుశాంతి అతడికి సంగతి చెప్పి, కుడితి నీళ్ళను ఏం చేయాలని అడిగింది. కామ రాజు విసురుగా రెండు క్షణాలు భార్య వంక చూసి, "నా నెత్తిన తెచ్చిపొయ్యి!" అని, పద్మాసనం వేసుకుని కళ్ళు మూసు కున్నాడు.

అలా అన్నదే తడవుగా సుశాంతి, కుడితినీళ్ళకుండను నిదానంగా ఎత్తి, కామరాజు తల మీద గుమ్మరించింది. కామరాజు బెంబేలెత్తిపోతూ శివమెత్తిన మనిషిలా లేచి, సుశాంతి చెంపమీద ఛెళ్ళున ఒక దెబ్బ వేశాడు. సుశాంతి ఆశ్చర్యంగా భర్తవంక చూసింది.

కామరాజు పట్టలేని కోపంతో, "నీకసలు బుద్ధంటూ వున్నదా? ఏమిటి నువ్వు చేసినపని?" అని అడిగాడు సుశాంతిని.

సుశాంతి కళ్ళనీళ్ళు పెట్టుకుని, "మీరేగదా పొయ్యమన్నారు! కుడితినీరు వృథా చెయ్యకుండా అలా తల మీద పోసుకోవడం, ఆరోగ్యానికేమైనా మంచి దేమో అనుకున్నాను," అన్నది.

ఆ జవాబు విని కామరాజు గట్టిగా తల బాదుకుని కూలబడ్డాడు. కాసేపట్లో సుశాంతి పొడిబట్ట తెచ్చి అతడి వళ్ళంతా తుడుస్తూ, "తప్పయితే నన్ను క్షమిం చండి!" అన్నది.

కామరాజుకు తన భార్య అమాయ కత్వం మీద చెప్పరానంత జాలికలిగింది. ఇంతకుముందు జరిగిన సంఘటనల తాలూకు జ్ఞాపకాలు అతడు మరిచి పోలేదు. అందువల్ల, ఆనాటి నుంచీ ఎప్పు డైనా కోపం వచ్చి బుద్ధివశం తప్పి మాట పరుషంగా రాబోతూ వుంటే, వెంటనే తమాయించుకునేవాడు.

ఇది గమనించిన సుశాంతి, అన్ని విషయాల్లోనూ భర్తకు అనుకూలంగా మసులుకుంటూ, అతడి కేవిధంగానూ మనసు నొయ్యకుండా జాగ్రత్తపడుతూ వచ్చింది. క్రమంగా కామరాజు కోపం దానంతట అదే పోయింది.





# బంగారు ఎలుక

ప్రతిష్ఠానదేశంలో సుప్రతిష్ఠితం అనే గొప్ప నగరం ఉండేది. ఆ నగరంలో ఒక వైశ్యస్త్రీ ఉండేది. ఆమె భర్త చనిపోగానే దాయాదులు అతని ఆస్తియావత్తూ కాజేశారు. భర్త పోయేనాటికి ఆమె గర్భవతిగా వుండి. అనంతరం ఒక కుమారుణ్ణి కన్నది. ఆమె అష్టకష్టాలుపడి ఆ కొడుకును పెంచి పెద్దజేసింది. కొడుకు పెద్దవాడయ్యాక ఒకనాడు తల్లి వాడితో ఇలా చెప్పింది:

''నాయనా, నీవు వైశ్య కుమారుడివి. వ్యాపారం మన కులవృత్తి. దురదృష్ట వశాత్తూ నీవు అగర్భదరిద్రుడవు. అందు చేత వ్యాపారానికి అవసరమైన పెట్టుబడి ధనం లేదు. అయితే ఈ నగరంలో ధనగుప్తుడు అనే కోటీశ్వరుడున్నాడు. పేద వ్యాపారుల బిడ్డలకు సహాయం చేస్తాడు. ఆయన దర్శనం చేసుకొని పెట్టుబడికి ధనం తెచ్చుకో!''

తల్లి చెప్పినట్టే ఆ వ్యాపారిబిడ్డ ధనగుప్తుడిని చూడబోయాడు. ఆ సమయంలో ఆ కోటీశ్వరుడు మరొక యువకుణ్ణి కోప్పడుతున్నాడు:

''నీకు కొంచెమైనా వ్యాపారదక్షతలేదు. నీకు ఎన్నిసార్లో ధనసహాయం చేశాను. దానిమీద లాభం సంపాదించలేకపోగా, నేనిచ్చినది కూడా పోగొట్టుకున్నావు. తెలివిగలవాడైతే ఆ చచ్చిన ఎలుకను పెట్టుబడిగా చేసుకొని లక్షలు సంపాదించవచ్చు.''

ఈ మాటలు వింటున్న కుర్రవాడు ధనగుప్తుడిని ధనం అడగలేదు. దూరాన చచ్చి పడిఉన్న ఎలుకను తీసుకొన్నాడు. దానిని తీసుకుపోయి ఒక వర్తకుడి పిల్లికి ఆహారంగా ఇచ్చి, దానికి ప్రతిఫలంగా రెండుదోసిళ్ళ శెనగలు పుచ్చుకొన్నాడు. వాటిని వేయించి కారపు శెనగలు చేసి,

ఒక మంచినీళ్లకుండ తీసుకొని, ఊరిబయటికి వెళ్ళి ఒక చెట్టునీడలో కూర్చున్నాడు.

మిట్టమధ్యాన్నంవేళ అడివిలో కట్టెలు కొట్టుకొని వచ్చేవాళ్లు అక్కడికి వచ్చి ఆ చెట్టునీడనే కాస్సేపు విశ్రాంతి తీసుకున్నారు. కుర్రవాడు వారి యోగక్షేమాలు విచారించి, తలా కాసిని కారపుశెనగలు పంచిపెట్టితాగేటందుకుమంచినీళ్లిచ్చాడు. అందుకు వాళ్లు ఎంతో సంతోషించి తలా రెండు కట్టెలు కుర్రవాడికిచ్చి వెళ్ళిపోయారు.

ఈవిధంగా సంపాదించిన కట్టెలు చిన్న మోపు కట్టి కుర్రవాడు కూడా నగరంలోకి తిరిగివచ్చి, వాటిని అమ్మి, ఆ డబ్బులో కొంత పెట్టి మళ్ళీ శెనగలు కొన్నాడు. ఇలా కొన్నాళ్ళు జరిగాక అతను కట్టెల మోపులే కొనదగినంత ధనం కూడబెట్టాడు. తరవాత కారపుశెనగల బేరం మాని కట్టెలమోపులు కొని భద్రం చేశాడు. ఇంతలో వర్షాకాలం వచ్చింది. కట్టెలకు గిరాకీ హెచ్చింది. తాను కొన్న కట్టెలన్నీ అమ్మేసి ఆ డబ్బుతో ఒక చిల్లరదుకాణం పెట్టాడు.

చిల్లరవ్యాపారం రానురాను పెద్ద వర్తకంగా పరిణమించింది. వర్తకాన్ని బాగా పెంచుకొని, దానిమీద వచ్చే లాభాలతో ఇళ్ళూ వాకిళ్ళూ, తోటలూ దొడ్లూ కొని కాలక్రమాన ఆ కుర్రవాడు లక్షాధికారి అయినాడు. అతని సంపదకు మూలం ఎలుక కనుక అందరూ అతన్ని 'ఎలుకసెట్టి' అని పిలవసాగారు.

ఎలుకసెట్టి ఒకనాడు బంగారంతో ఒక ఎలుకను చేయించి దానిని తీసుకొని వెళ్ళి ధనగుప్తుడికి సమర్పించి, "అయ్యా, ఇది మీరు నాకు చూపిన పెట్టుబడి. దీనివల్ల నేను చాలా ధనం గడించాను. వడ్డీతోసహా దీనిని మీకు తిరిగి ఇస్తున్నాను," అన్నాడు.

ఎలుకసెట్టి కథ యావత్తూ విని ధనగుప్తుడు అతని తెలివితేటలకూ, సద్బుద్ధికీ సంతోషించి, తన కుమార్తెను అతనికిచ్చి పెళ్ళిచేస్తూ, ఆ బంగారుఎలుకనే అల్లుడికి కానుకగా ఇచ్చాడు.





# చీనాంబరాలు

ముూడువేల సంవత్సరాలక్రితం చీనా చక్రవర్తి ఒక అందమైన అమ్మాయిని పెళ్ళాడాడు. ఆమె పేరు సీలింగ్‌షీ. ఆమె వయస్సు పధ్నాలుగేళ్ళు. చీనాచక్రవర్తికి పట్టపురాణిఅయిన సీలింగ్‌షీకి ఏ లోటూ లేదు. రోజల్లా ఆమెకు వినోదం కలిగించటానికి గాయకులూ, నర్తకులూ ఉండేవారు.

కాని ఇన్ని ఉండి కూడా సీలింగ్‌షీకి పెద్ద విచారం పట్టుకున్నది. ఆమె కళ్ళ వెంట నిరంతరం అశ్రు ధారలు కారసాగాయి. ఆమె దుఃఖాన్ని బాపటానికి ఎందరో ప్రయత్నించారు. కాని లాభం లేకపోయింది. ఆమె దుఃఖానికి కారణమేమంటే, ఆమె ఎన్నడూ తన పుట్టింటివారిని విడిచి ఉండినదికాదు. అందులోనూ చిన్నపిల్ల. దూరాన ఉన్న తన తల్లిదండ్రులనూ, అన్నదమ్ములనూ తలుచుకుని ఆమె ఎల్లవేళలా కుమిలిపోసాగింది.

తన పట్టమహిషి చింతాక్రాంతురాలై ఉన్నదన్న వార్త చక్రవర్తికి తెలిసి, ఆయన ఉద్యానవనానికి వచ్చాడు. తోటలో కంబళీవృక్షం నీడను కూర్చొని ఉన్న తన భార్యను సమీపించి, "రాణీ, నీకేమి లోటు జరిగింది? నీ ఆరోగ్యం బాగా లేదా?" అని అడిగాడు రాజు.

"స్వామీ, నాకే లోటూలేదు. నా మనసుకు ఉల్లాసంగా లేదు. అంతకంటె మరేమీలేదు," అన్నది సీలింగ్‌షీ.

మహారాజు తన మంత్రులనుపిలిపించి, "మీరు త్వరలోనే మహారాణి మనసుకు ఉల్లాసం కలిగించే యోచనలు చేయండి," అని ఆజ్ఞాపించాడు.

ఇంతలోనే పరిచారికలు తేనీరు తెచ్చి మహారాణి ముందుపెట్టారు. ఆ తరవాత ఆమె ఆచారం ప్రకారం తానే స్వయంగా తేనీరు గిన్నెలలో కలిపి పాటగాళ్ళకూ,

చీనా జానపద కథ




ఆటగాళ్ళకూ ఇచ్చి తన గిన్నె ముందుంచుకున్నది.

ఈ సమయంలో కంబళీవృక్షం మీద నుంచి ఏదో వస్తువు మహారాణి తేనీటి గిన్నెలో టప్‌మని పడింది. తేనీరు చింది మహారాణి దుస్తులపై పడింది. పరిచారికలు ఆమెను సమీపించబోయారు.

''నాదుస్తులకేమీతొందరలేదు. గిన్నెలో పడిన వస్తువేమిటో చూడండి,'' అన్నది మహారాణి.

పరిచారికలు గిన్నెలోని తేనీటి నుంచి చిన్న దారపు ఉండలాటి పదార్థాన్ని తీసి మహారాణి చేతిలో పెట్టారు. అది మరేమీ కాదు, పట్టుపురుగులు కంబళీ వృక్షాల మీద పెట్టే గుడ్డు తాలూకు పిసినికాయ. అలాంటి పిసినికాయలు కంబళీవృక్షం మీద ఇంకా అనేకం ఉన్నాయి.

తేనీటిలో పడిన పిసినికాయను పరిచారికల నుంచి తన చేతిలోకి తీసుకున్నప్పుడు సీలింగ్‌షీ ఒక వింత గమనించింది. ఆ పిసినికాయ విచ్చుకుని సన్నని, నిగనిగలాడే పోగులు వెలుపలికి రాసాగాయి.

''ఆహా! ఇదే దారమైతే దీనితో నేసే వస్త్రాలు ఎంత అందంగా ఉండాలి!'' అనుకున్నది సీలింగ్‌షీ. మరుక్షణమే ఆమెకో ఆలోచన తట్టింది. ఈ పోగులు మరీ సన్నగా ఉన్నమాట నిజమేగాని ఇవి సులువుగా తెగటం లేదు. అదీగాక ఈ ఒక పిసినికాయలోనే ఎన్నో వేల గజాల పోగులు వున్నట్టుకనిపిస్తున్నది. ఈపోగులను అనేక పేటలువేసి పేనినట్టయితేదారంతయారవుతుంది. అప్పుడు దానిని మగ్గం మీద నేసి, అందమైన బట్టలు తయారు చేయవచ్చు.

ఈ ఆలోచన రాగానే మహారాణి బాధ కాస్తా మటుమాయమయింది. ఆమె ఉత్సాహంతో లేచి తన పరిచారికలను పిలిచి తన చేతిలోవున్న పోగును విప్పదీసి, పేనమని చెప్పింది. వారలాగేనని, నిగనిగలాడే దారం పేని పుల్లలకు చుట్టసాగారు.

''ఇట్లా ఎంత దారమైతే ఒక బట్ట కాను? మీరంతా కలిసి చెట్టుమీద వున్న

పిసినికాయులను ఏరి తెచ్చి తేనీటిలో వెయ్యండి,'' అన్నది మహారాణి.

ఎవరికీ క్షణం తీరిక లేదు. అదివరకు క్షణమొక యుగంగా గడిపిన మహారాణి కిప్పుడు ఘడియలు క్షణాలలాగా సాగి పోతున్నాయి. సూర్యాస్తమయే లోపల చాలా కండెలదారం తయారయింది. ఆమె వడ్రంగులను పిలిపించి. ''ఈ దారం చూడండి. ఇంత సన్నని దారం నేయ టానికి మగ్గం తయారుచేయండి. తెల్లవారే లోగా మగ్గం తయారయి నా గదిలో ఉండాలి,'' అని ఆజ్ఞాపించింది.

మర్నాడు చక్రవర్తి తన మంత్రులను పిలిపించి, ''పట్టపురాణి మనసు ఉల్లాసంగా ఉండటానికి ఏమాలోచించారు?'' అని అడిగాడు.

''చిత్తం,ప్రభూ! ఒక చక్కని నెమిలిని తెచ్చి మన ఉద్యానవనంలో వుంచినట్టయితే దేవిగారు దాని నాట్యం తిలకిస్తూ, దాని ఈకల రంగులు చూసి వినోదిస్తూ...." అని ఇద్దరు మంత్రులూ గొణిగారు.

తన ఇద్దరు మంత్రులకూ సరిఅయిన ఆలోచన తోచలేదని తెలుసుకుని చక్రవర్తి తనపట్టపురాణినిపిలవమనిఆజ్ఞాపించాడు.

''ప్రభూ! మహారాణిగారింకా తమ గది నుంచి బయటికే రాలేదు,'' అన్నారు నౌకర్లు.




''ఇంత పొద్దెక్కి ఇంకా బయటికే రాలేదా?'' అన్నాడు చక్రవర్తి. తన ప్రియభార్య ఆరోగ్యం గురించి ఆయనకు ఆందోళన కలిగింది. ఆయన సింహాసనం దిగి సరాసరి రాణిగదికి వెళ్లాడు. చక్రవర్తి లోపల అడుగువేస్తూ చూసిన దృశ్యం ఆయనకు అశ్చర్యమూ, ఆనందమూ కలిగించింది.

మహారాణి విచారసాగరంలో మునిగి ఉండకపోగా, ఒక విచిత్రమైన మగ్గం ముందు సంతోషంగా కూచుని ఎన్నడూ కనని, విననంత అందమైన దారపు పోగులతో ధగధగ మెరిసే నాజూకైన వస్త్రం దీక్షతో నేస్తున్నది.

మహారాణి తల ఎత్తి చక్రవర్తి కేసి చూసింది. ఆమె కళ్ళు ఆనందంతో మెరుస్తున్నాయి. చిరునవ్వు నవ్వింది.

''మహాప్రభూ! నా విచారంతో మీకు బాధ కలిగించాను. దానికి పరిహారంగా మీకీ దేవతావస్త్రం నేసిఇస్తున్నాను, ఆగ్రహించరుకద ?'' అన్నదామె.

''ఆగ్రహమా ? ఇంత అపూర్వమైన వస్త్రం బహుమతి పొందుతూ ఆగ్రహించగలనా ?'' అన్నాడు చక్రవర్తి.

సీలింగ్‌షీ తన భర్తతో జరిగినదంతా చెప్పింది.

''తమ భార్యగా వుండి నేను పని చెయ్యటం భావ్యంకాదు. అందుచేత ఈ సంగతి రహస్యంగా ఉంచాను,'' అన్నది మహారాణి.

''దానికి నాకేమీ విచారం లేదు. నీ మనసుకు తృప్తి కలిగించినవారికి అర్ధ రాజ్యం ఇవ్వటానికి కూడా సిద్ధపడ్డాను. నీ విచారం తొలగిందే నాకు పదివేలు,'' అన్నాడు చక్రవర్తి.

అయితే, "మహాప్రభూ! నా కోరిక ఒకటి నెరవేర్చండి.'' అన్నది మహారాణి.

''అలాగే నీ ఇష్టం వచ్చింది కోరుకో!'' అన్నాడు చక్రవర్తి.

''వెయ్యి కంబళీవృక్షాలతో నాకొక తోట వేయించిపెట్టండి!'' అన్నది మహారాణి. చక్రవర్తి ఆమె కోరిక నెరవేర్చాడు.

సీలింగ్‌షీ ప్రపంచంలో మొట్టమొదటి పట్టు వస్త్రాలు నేసింది. ఇప్పటికీ చీనా భాషలో 'సీ' అంటే పట్టు. ఆమె అనంతరం చీనాదేశపు మహారాణులు ఆమె ఏర్పాటుచేసిన సంప్రదాయాన్ననుసరించి, ఏటా ఒక రోజు పట్టుపురుగులకు తమ చేతి మీదుగా ఆహారం వేస్తూవచ్చారు.

కాలక్రమాన పట్టువస్త్రాల రహస్యం చీనానుంచి ఇతరదేశాలకు పాకింది. అందుకనే మన పూర్వీకులు పట్టువస్త్రాలను చీనాంబరాలనేవారు. మిగతా దేశాలలో పట్టువస్త్రాలు తయారయినా కూడా చీనా దేశపు పట్టువస్త్రాలకు గణ్యత ఉన్నది. వీటిని మనవారుచీని చీనాంబరాలనేవారు.



భూగోళంలో దాదాపు 60.20.000 చదరపుమైళ్ళు అంటే భూభాగంలో ఇంచు మించు 10.4 శాతం మంచుగడ్డలతో కప్పబడి ఉన్నది।

మంచుగడ్డలు

## పాములను చంపే పక్షి

ఆఫ్రికన్ సెక్రటరీ అనే ఒకరకం పక్షి నేలపై నడుస్తూ ఆహారం కోసం పాములను వేటాడి చంపుతుంది. ఈ పక్షి మామూలుగా పాములను కాళ్ళతో తొక్కి చంపుతూ వుంటుంది.




సోవియట్ రష్యా మధ్య సైబీరియాలోని బేకాల్ సరస్సే ప్రపంచంలోకెల్లా చాలా లోతైన సరస్సు. ఇది 4,872 అడుగుల లోతున్నది.

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.





S. Maheswar Rao M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ నవంబర్ నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చేయి ప్రయత్నం!

రెండవ ఫోటో: చేరువవుతుంది జలం!

పంపినవారు: సి. హెచ్. ఐశ్వర్య, కొత్తపేట, తుని (తూ. గో. జిల్లా)—533401

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా: రూ. 36-00

చందా పంపవలసిన చిరునామా:

చందమామ పబ్లికేషన్స్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు-600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.


---